

మధు పిక్చర్స్

# ఇంటి  కోడలు

నిర్మాత పి మల్లికార్జునరావు

దర్శకత్వం: లక్ష్మీదీపక్

శ్రీ ఫిలింస్

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం : 4–10–'74
ఆనందనామ సం. నిజ భాద్రపదమాస బ. తదియ
సంపుటము : 68 సంచిక : 3
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా — రు. 31–20 పై.
ఆరుమాసాల చందా — రు. 15–60 పై.
విడిప్రతి వెల 55 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
సూసన్ భూషణ్
(ఫొటో : శ్రీ ప్రవీణ్‌కుమార్)



# ఉత్తరాలు

### హైదరాబాద్. నోట్‌బుక్

తెలుగు దేశం ముఖ్యంగా తెలంగాణాలో నున్న జంటనగరాలలో తరతరాలు ఉంటూ, తెలుగు నేర్వకపోగా ఈసడిస్తున్న ఇతర భాషలవారు ఈ విశ్వవిద్యాలయంలో ప్రబలులై ముఖ్యోద్దేశ్యానికి భంగం కలిగించవచ్చు' అన్న రామచంద్రగారి వాక్యాలు ఆణిముత్యాలు. శ్రీ సింగ్‌గారిని కేంద్ర విశ్వవిద్యాలయానికి ప్రత్యేక అధికారిగా వేసినప్పుడే ముఖ్యోద్దేశ్యానికి భంగం కలిగింది. ఆపైన ఇంగ్లీషు మీడియం పెట్టడం ఆపైన ఆంధ్రులకు (తెలుగు వారికి) 80 శాతం సీట్లను రిజర్వు చేయకపోవడం— ఇవన్నీ ఏ పరిస్థితుల్లో కేంద్ర విశ్వవిద్యాలయం పెట్టాలన్న తలంపు ఏర్పడిందో దానికి విరుద్ధంగా ఉన్నవి. ఇవన్నీ చూస్తుంటే కేంద్ర విశ్వవిద్యాలయం ఆంధ్రులకు అందేటట్లుగాలేదు. కావున పాలకులు పరిస్థితిని గుర్తించి ఆంధ్రులకు కనీసం 60 శాతం సీట్లనైనా రిజర్వు చేసేటట్లు చూడాలి.

రామచంద్రగారు అన్నట్లు తెలుగు రానివాడు, తెలుగు సంస్కృతి తెలియనివాడు తెలుగు దేశ ప్రతినిధిగా చెలామణి అవుతున్నారు.

ఇంతకుముందు ఎన్నో ఉత్తరాలు మీకు పంపి మీరు ప్రచురించకపోయినను విసుగుచెందని విక్రమార్కునిలా ఇంకా ఉత్తరాలు పంపిస్తున్న నవీన విక్రమార్కుడు:— యన్నం తేజోనిధి (నెల్లూరు.)

### సీరియల్ -

"అతకని అనుబంధాలు" సీరియల్‌లో పూరి చెరువుగట్టుమీద హేమ బట్టలు కనిపించగానే హేమ చెర్లో పడి ప్రాణం తీసికొందని వూళ్లో వాళ్ళు తీర్మానించారు అని వ్రాశారు. చెర్లో పడి ప్రాణాలు తీసికొనేటందుకు బట్టలు విప్పి గట్టు మీద పెట్టాలా ? ఒకవేళ అలా ఉంచిందే అనుకుంటాము ! కాని భూషణరావుగారు ఆమెను రక్షించి ఇంటికి తీసికొనిపోతాడుకదా ! అప్పుడైనా ఆమె తన బట్టలను వేసికొని వెళ్తుందికదా ! మరి ఆ చెరువు గట్టు మీద హేమ బట్టలు ఎలా మిగిలినట్టు ?

పి. రాజేంద్రనాయుడు బి.ఎస్‌సి., (వేపగలూరు.)

### కథలు

పత్రికలో రాను రాను హాస్య కథలు కొరవడుతున్నాయి. వేసే కథలలో తప్పనిసరిగా ఒక హాస్య కథానిక ఉండేలా పత్రిక పాఠకుడిగా నా అభ్యర్థన.

ఎమ్. వరలక్ష్మివెంకట్ (ఉరవకొండ) ●

# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

**తెలుగులో హరివంశములు :**

సుప్రసిద్ధ విదుషీమణి డాక్టర్ పి యశోదారెడ్డి రచించిన సిద్ధాంత వ్యాస గ్రంథం ఆవిష్కరణ సెప్టెంబరు 9వ తేదీన కళాభవన్‌లో వైభవోపేతంగా జరిగింది వైభవమంటే విజ్ఞాన వైభవం సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షతవహించారు డాక్టర్ గోపాలరెడ్డి గ్రంథాన్ని ఆవిష్కరించారు డాక్టర్ యశోదారెడ్డి విద్యార్థి దశ నుంచి క్రమంగా ఆంధ్రప్రదేశ్ అంతటా ప్రసిద్ధిగాంచిన విదుషీమణిగా అభివృద్ధి అయిన తీరును, ఆమె ప్రజ్ఞా విశేషాన్ని శ్రీ రామానుజరావు వివరించారు

ఈ గ్రంథం వ్యయప్రయాసల పద్మవ్యూహం నుంచి ఇలాటి ఉత్తమ గ్రంథం వెలువడినందుకు డాక్టర్ గోపాలరెడ్డి గ్రంథకర్త్రిని ప్రశంసించారు కొన్ని గ్రంథాలు ఆహా అనేట్టు, మరికొన్ని హోహో అనేట్టు ఉంటాయని, ఇది ఆహా అనేట్టుగా ఉందని, డాక్టర్ వెంకటావధాని ప్రశంసిస్తూ, గ్రంథంలో డాక్టర్ యశోదారెడ్డి చేసిన నూతన సిద్ధాంతాలను వివరించారు. డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు గ్రంథంలోని కృష్ణతత్వాన్ని విపులీకరించి, డాక్టర్ యశోదారెడ్డి, కృష్ణావతార తత్వాన్ని భక్తి భావంతో తత్వచింతనతో నిరూపించారన్నారు· ఆచార్య లక్ష్మీరంజనం గ్రంథకర్త్రిని ఆశీర్వదిస్తూ "ఆంధ్రుల అభ్యవహార" సర్వస్వాన్ని డాక్టర్ యశోదారెడ్డి నిర్వహించాలని కోరారు డాక్టర్ యశోదారెడ్డి సవినయంగా కృతజ్ఞత తెలుపుతూ తన అభ్యున్నతికి కారణమైన గురువులను, మిత్రులను గౌరవంతో స్మరించారు శ్రీ నీలా జంగయ్య ధన్యవాదాలతో 'ఆవిష్కరణోత్సవం' సమాప్తమైంది

**ఏకీకరణకు బహుమతి :**

ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాలు అంతరంగ అల్లకల్లోలాలతో విచ్ఛిన్నమైపోయి, యావద్భారతానికీ ముప్పు ఏర్పడనున్న దుస్థితిలో ఆయా రాష్ట్రాలను ఉద్ధరించి, భిన్నత్వాన్ని అరికట్టిన ముఖ్యమంత్రులు శ్రీయుతులు హెచ్. ఎన్. బహుగుణ, జలగం వెంగళరావు, దేవరాజ అరసులకు సెప్టెంబరు 8వ తేదీన మహిళా కళాశాల ఆవరణలో ఏకీకరణ బహుమతులు ఇవ్వడం ఎంతో బాగుంది ఈ బహుమానాన్ని యునైటెడ్ హిందూ ముస్లిం ఫ్రంట్ అనే సంస్థ ఏర్పాటుచేసింది గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ అందజేశారు

**ప్రపంచ తెలుగు మహాసభ కార్యాలయం**

ప్రపంచ తెలుగు మహాసభ కార్యాలయాన్ని రవీంద్రభారతి మొదటి అంతస్తులో సెప్టెంబరు 8వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రారంభించారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతవహించారు మహాసభ కార్యనిర్వాహకాధ్యక్షుడు శ్రీ మండలి వేంకటకృష్ణారావు మహాసభ ఉద్దేశ్యాలు లక్ష్యాలు వివరించారు ప్రధాన కార్యదర్శి డాక్టర్ అప్పారావు సభా కార్యక్రమాల ప్రగతిని విపులంగా చెప్పారు

**వరకట్నాలపై దాడి·**

ఎన్ని చట్టాలు చేసినా రూపుమాయని వరకట్న పిశాచిని ప్రతిఘటించడానికి జంటనగరాల అభ్యుదయ మహిళా సంస్థ పెద్ద ఎత్తున కార్యక్రమం తలపెట్టింది సభలు, పూరేగింపులు జరపడం, స్త్రీ

నివేదికలు అందజెయడం కరపత్రాల ద్వారా ప్రచారం చేయడం మొదలయినవి ఈ కార్యక్రమంలో కొన్ని అంశాలు.

**వాల్‌పోస్టర్లు :**

కాయితాల కరువు కాలంలో ఏ గోడ చూచినా సందు లేకుండా కనిపించే పోస్టర్లను చూస్తే ఎవరికైనా కష్టం కలుగుతుంది విద్యార్థులకు నోటు బుక్కులు లేవు. రచయితలకు పుస్తకాలు ముద్రించుకొందామంటే, కాగితం దిక్కు లేదు. పత్రికలవారికి ఎక్కువ వార్తలిచ్చి ప్రజాసేవ చేద్దామంటే న్యూస్‌ప్రింట్ లేదు చాలా కంపెనీలు తెల్ల కాగితాలు లేక ఏదో ఎర్రటి మడ్డికాయితాలపై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాయి ఇంతటి క్లిష్ట పరిస్థితిలో ఈ పోస్టర్లకు విశాలమయిన కాయితాలు ఎలా వస్తాయో!

**ప్రకాశం విద్యానికేతన్ :**

ఆనందనగర్ సంక్షేమ సంఘం నిర్వహించే ప్రకాశం విద్యానికేతన్ నూతన భవనాలకు ప్రకాశం జన్మదినోత్సవం సందర్భంగా విద్యామంత్రి శ్రీమండలి వెంకటకృష్ణారావు ప్రారంభోత్సవం జరపడం, శ్రీ న్యాపతి రాఘవరావు రచించిన 'ఇంటి ముందు' అనే హాస్య నాటికను, నృత్య నాటికను వినోద వేష ప్రదర్శనం మొదలైన కదంబ కార్యక్రమాన్ని నికేతన్ విద్యార్థులు నిర్వహించడం ఎంతో హాయి అనిపించింది. సంక్షేమ సంఘం అధ్యక్షులు శ్రీ ఓ.వి. నరసింహం, కార్యదర్శి శ్రీ రాజారావు, శ్రీ ఎన్. సి. కె. చారి మొదలయినవారిని ప్రశంసించక తప్పదు.

**హ్యూమానిటేరియన్ యూత్ అసోసియేషన్:**

దీనులకు, దరిద్రులకు ఉచితంగా చదువు చెబుతూ ఆర్తులకు మందులిస్తూ సేవ చేస్తున్న హ్యూమానిటేరియన్ యూత్ అసోసియేషన్ సెప్టెంబరు 8న ఉచిత సంస్కృత తరగతుల ద్వితీయ వార్షికోత్సవము జరిపినప్పుడు, హిందీ మహా విద్యాలయం ఆంగ్ల శాఖాధ్యక్షులు శ్రీ కె ఆర్. సుబ్రమణ్యం అధ్యక్షతన జరిగిన సమావేశంలో శ్రీమతి కె. కమలా రఘుపతిరావు సంస్కృత నాటకాలలో తక్కువ తెలిసిన పాత్రలను గురించి ప్రసంగించారు డాక్టర్ వి జి లాలే సంస్కృతాభ్యాసం ఇతర భాషలకు విరుద్ధం కాదన్నారు. శ్రీ సూర్యానందం జయదేవుని అష్టపదులు గానం చేశారు

**ఉపశ్రుతి :—**

"ఆవును గురించి వ్యాసం ఏమి వ్రాశావ్?"
"గాయ్ హమారీ మాతాహై
హమ్‌కో కుచ్‌న ఆతాహై"
(గోవమ్మ నాకు తల్లి. నాకు వచ్చింది సున్నకు సున్న హళ్లికి హళ్లి) అని వ్రాశాను".
"అయితే నీకు మేస్టారు
బైల్ తేరా బాప్ హై
మార్కు దేనా పాప్ హై
(నాయనా నీ తండ్రి ఎద్దు. మార్కులిచ్చే పాపం నాకు వద్దు) అని సమాధానం చెబుతాడులే".







సీరియల్

కాకాని కమల

రంగ

(గత సంచిక తరువాయి)

..."ఏసేవ్! చిన్నక్కా! కాస్త జెల్దీ రావే లైటైమయిపోతున్నది" అంటూ హాల్లోంచి కేకలు పెడుతోంది సుందరి. బయట జేరింది. లల్లారితే నీళ్ళు అయినా కాలేజీ మానదు. కాలేజీకి లైటైమయి పోతోంది అన్నం అయితే పెట్టారుగాని ఒక్కళ్ళూ అద్దం దువ్వెనా ఇవ్వటంలేదు విసుగు వచ్చేస్తోంది సుందరికి ప్రొద్దున్నే అష్టసుద్దులూ తింది తల్లిచేత. గుమ్మానికి వున్న కర్టెన్ ముట్టుకుని చూడ నట్లు వెళ్ళిపోతుంటే తల్లి చూడనేచూసింది

"ఇంట్లో దేవుడున్నాడు స్ఫటిక లింగాలు న్నాయి ఇటువంటి వెధవపన్లు చెయ్యొచ్చా! అంటూ సొంటూ లేని పీనుగ" అంటూ తిట్టనే తిట్టింది చివరికి కూర తరుగుతున్న అనూరాధ కత్తిపీట మించి లేచి వచ్చి చెల్లెలుకి కావలసినవి ఇచ్చి పంపింది.

"ఈ మూడు రోజులు స్కూలు కెళ్ళేది కాక ఇంకా అలంకరణ కూడా ఎందుకే!" అంటుంది తల్లి.

"ఆఁ. బొట్టు కాటుక పెట్టుకోకుండా ఒకే బట్టలో స్కూలు కెడితే ఇంకేమయినా వుందా? మగపిల్లలు అసలే కోతి వెధవలు... ఏడిపించుకు తినేస్తారు" అంటుంది సుందరి

అసలు సుందరి ఇంత శ్రద్ధగ కాలేజీకి వెళ్ళటానికి కారణం చదువుమీద ఆవిడకున్న శ్రద్ధ అనుకునేరు. కాదు సుందరికి కాలేజీలో ఒక "బోయ్ ఫ్రండ్" వున్నాడు వాళ్ళు స్కూలు చదువు నుంచి స్నేహితులు. వారి చదువులాగే వారి ప్రేమ దినదినాభివృద్ధి నొందుతున్నది. అతని పేరు కృష్ణ!

* * *

ఆరోజు భోంచేస్తూ రామనాథం భార్యతో "వాళ్ళ పిల్లని చూసుకెళ్ళిపది రోజులు దాటు తోంది ఇంకా అతీ గతీ లేదు" అన్నారు.

శ్రీనివాస్ తండ్రి పేరు రామారావుగారు. సర్వే ల్యాండు రికార్డ్సులో పని చేస్తున్నారు. ఆ జీతం డబ్బు తప్పించి వేరే చిన్నమెత్తు ఆస్థిలేదు. శ్రీనివాస్ 3వ సంవత్సరం యం బి బి ఎస్. చదువుతున్నాడు.

అతని పై మగపిల్లలిద్దరూ గ్రాడ్యుయేట్లు ఇద్దరూ తగ్గ ఉద్యోగాల్లోనేవున్నారు. వాళ్ళకి పిల్లలు. వాళ్ళ సంసారాలు వాళ్ళ లిప్పలు వాళ్ళకున్నాయి. ఎప్పుడో తప్పనిసరి పరిస్థితుల్లో తండ్రికి పాతికో పరకో పంపు తారుగాని అంతకు మించి సహాయపడలేని స్థితిగతులు! శ్రీనివాస్ తెలివిగలవాడు. పి. యు. సి. క్లాసుమార్కులతో పాసయ్యాడు.

*జరిగినకథ 2:* రామనాథంగారి భార్య సుభద్రమ్మ వారికి అనూరాధ, లక్ష్మి, సుందరి, శోభ అనే నల్గురమ్మాయిలు, రమణ అనే అబ్బాయి ఉన్నారు అనూరాధకు పెళ్లి సంబంధాలు చూస్తూంటారు. రామనాథంగారు. అనురాధని చూసుకుని వెళతారు పెళ్ళివారు.

తండ్రి చెప్పినా వినిపించుకోకుండా 'ఎంట్రన్సు' పరిక్ష పాసయి, ఏవిధమయిన రికమండేషను లేకుండా మెడిసన్‌లో సీటు సంపాదించు కున్నాడు.

మెడిసన్ ఖరీదయిన చదువు నా స్తోమతు నీకు తెలిసున్నదే! వద్దన్నారు రామారావుగారు. అంతెత్తున లేచాడు శ్రీనివాస్! ఎంతో మంది సీటుకోసం 'క్యూ'ల్లో నుంచున్నారు మీరు చెప్పించకపోతే నేను రిక్షా లాగయినా చదివి తీరతాను అన్నాడు. అలిగి నాలుగు రోజులు నీళ్ళు తిండి మానేసి బజార్లమ్మట తిరిగాడు. ఇంట్లో పెద్ద రభస జరిగింది. రామారావు గారికి కూడా చెప్పించాలనే వుంది. కాని డబ్బుచూసి భయపడ్డారు. కొడుకు అభివృద్ధిలోకి రావటం ఏతండ్రికి ఇష్టం వుండదు? వున్నదల్లా ఆర్థిక సమస్య తప్ప! కొడుకు పంతగొట్టుతనం చూసి సరే ఏదో విధంగా లాగుదాం లెమ్మని మెడిసన్‌లో చేర్పించారు.

ముందు రెండేళ్ళు ఆలోన్లూ ఈలోన్లూ తీసుకుని టరమ్ ఫీజులు కట్టారు. అవిగాక అదనంగా పుస్తకాలకి అంటూ ఇంకా చాలానే అవుతోంది. చేతిఖర్చుకి 30 రూ లు ఇచ్చినా తక్కువే! భార్య ఒంటిమీదవున్నబంగారమే చాలా తక్కువ. అదీ 'తాకట్టు' కి వెళ్ళక తప్పలేదు. ఇంక డబ్బుపుట్టే దారి కనబడలేదు రామారావుగారికి. ఇంట్లో ఇంకా చదువుకునే పిల్లలు వున్నారు పెళ్ళికావలసిన ఆడపిల్ల వుంది. ఏవిధంగా కట్నం సొమ్ము కూడబెట్టాలో తెలియక, సంబంధాలు చూడటం మానేశాడు. అమ్మటానికి సెంటు భూమిగాని చిన్న పూరి గుడిసె కాని లేదు. ఇప్పటికే బావమరిది దగ్గర 5, 6 వేలు వాడుకున్నాడు. అతనిది అంతంత మాత్రపు సంసారమే! పోనీ వడ్డీకి ఎక్కడయినా అప్పు తెద్దామన్నా తీర్చే దారిలేదు. అయినా ఎంతని తెస్తాడు? ఇంకా చదువు మూడేళ్ళుంది. ఇప్పటికే జీతంలో నాలుగవ వంతు వడ్డీలకి పోతోంది! శ్రీనివాస్ చదువు అయిన తరవాతేగదా ప్రాక్టీసుపెట్టి సంపాదించేది. అదీ రెండు మూడేళ్లకుగాని సాధ్యం కాని పని! ఈలోగా మార్వాడీలు వడ్డీల పేరుతో కొంపదోచేసి గోచీపాతతో వీధిలో నుంచునేలా చేస్తారు. ఇటువంటి పరిస్థితిలో శ్రీనివాస్‌కి పెళ్ళిచేస్తే ఆ కట్నం డబ్బు వాడుకోవచ్చునన్న అభిప్రాయంతో అనూరాధని చూసుకుందుకు వచ్చారు. ఆర్థిక సమస్యవల్ల

చదువు ఆగిపోకుండా వుండాలంటే అంత కంటే గత్యంతరం కనుపించలేదు

అందరికీ అనూరాధ నచ్చింది. శ్రీనివాస్ మాత్రం పలకటం లేదు. అనూరాధ రూపం వరకైతే అతనికి నచ్చింది గాని మిగలావి 'ససేమిరా' అంటున్నాయి!

దానికి కారణాలు సవాలక్ష!

"ప్రాపంచికంగా మనిషి కొన్ని పరిధుల్లో వున్నా అతని ఆశలు, ఆశయాలు అనంతాలు కారణం మనిషి పతనమయిన దేముడు... అతడు తన స్వర్గాన్ని గురించే తలపోస్తూ వుంటాడు" —అంటాడు 'లామర్టైన్' ఇప్పుడు శ్రీనివాస్ అదేస్థితిలో వున్నాడు. అతను పతనమైన దేముడు!

అసలు శ్రీనివాస్ ఒక ఆదర్శం పెట్టుకున్నాడు. అతను వాస్తవాన్ని మరిచి నేటి యువకులు కలలుకనే ప్రపంచంలో వున్నాడు కష్టపడైనా డాక్టరు అవుతే ఆ తరువాత అతని డిమాండు పెరుగుతుంది. తన అందానికి హోదాకి తగిన కుటుంబంలోని పిల్లని చేసుకోవాలి. ఒక డాక్టరు అల్లునికి తగిన హోదాలో మర్యాద చెయ్యగల ఇంటికి అల్లుడు కావాలి. అంతేగాని సామాన్య గుమాస్తా కూతుర్ని చేపట్టటం నామర్దాగా భావించాడు అమ్మాయి చూడబోతే అతి సామాన్యమైన చదువు. శ్రీనివాస్‌కి చక్కగా తనతో సమానంగా మెడిసన్ చదివిన అమ్మాయిని చేసుకుని ఇద్దరూ ప్రాక్టీసు చెయ్యాలనికోరిక లేకపోతే కనీసం 'గ్రాడ్యుయేటు' నయినా చేసుకోవాలి అంతేగాని 'పెళ్లిచదువు' చదివిన పిల్లని కాదు! పైగా చదువు పూర్తి కాకుండానే పెళ్లి చేసుకుంటే స్నేహితులంతా నవ్వుతారు మావగారు ఏం చేస్తారు? అమ్మాయి ఏం చదువుకుంది? అంటే తనేంచెప్తాడు? అది శ్రీనివాస్ బాధ! అదీగాక తనతోటి వాళ్ళంతా హాయిగా చదువుకుంటున్నారు. ఇంకా 'రమేష్' పెళ్ళికాలేదు. "తను దూర సందులేదు మెడకోడోలు" అన్నట్లు తను మాత్రం పెళ్ళి సంసారం అంటూ ఝంఝాటంలో ఇరకటం బొత్తిగా నచ్చలేదా యువకునికి! తను కాలేజీలో ఎంతో మందిని చూస్తున్నాడు. ఆడమగ అన్న విచక్షణ లేకుండా మంచి మంచి డ్రస్సులతో పర్సు నిండా డబ్బుతో వస్తారు. ఎంతో హాయిగా కుషీగా స్వేచ్ఛా విహంగాల్లా స్టూడెంట్ లైఫ్ ఎంజాయి చేస్తుంటే తనకి ఫీజు కట్టటం దగ్గర్నుంచి అన్నీ సమస్యలే! కేవలం కట్నం డబ్బు కోసం పెళ్ళిచేసుకోవటం అస్సలు నచ్చలేదు. కట్నం డబ్బుతో ఫీజు కట్టటం అతని ఆశయానికి విరుద్ధంగా వున్నది. రిక్షాలాగి అయినా చదువు తానని డాంబికాలు పలికాడు గాని దానికంటే ఇదే నయం రిక్షాలాగటం అంత తేలికకాదు సినిమాలో ఏ.. ఎన్... టి.ఆర్ లాగితే బాగుంటుంది గాని తనలాంటి వాడికి సరి పడదు అంత సులభమూ కాదూ! అనిపించింది. కాని ఎన్నివిధాల ఆలోచించినా 'పెళ్ళి' కంటే గత్యంతరం కనుపించలేదు. అందుకే ఆశయాలను అణగద్రొక్కి పరిస్థితులకు బానిసకాక తప్పలేదు శ్రీనివాస్.

అందుకే తండ్రి వాళ్ళకి ఉత్తరం ఏం వ్రాయమంటావ్ అని అడిగితే మారు మాట్లాడకుండా వూరుకున్నాడు. అప్పటికే మూడు నాలుగు సంబంధాలు చూశారు. అన్నీ ఇంతకంటే అధ్వాన్నంగా వున్నాయి. ఒకటి వుంటే ఒకటి లేదు. ఇంకా ఇదే నయం! పిల్ల బంగారుబొమ్మలా వుంది. తక్కిన విషయాలు వదిలేస్తే! వాళ్ళ స్థితి



## లాలస

మంతులైనా కాకపోయినా తాము కోరిన వరకట్నం ఇస్తున్నారు అనుకున్నారు రామారావుగారు చివరికి శ్రీనివాస్ ఒప్పుకోక తప్పలేదు చదువే ఆగిపోయే పరిస్థితి దాపురించింది ఇంక అంతకంటె ఏంచేస్తాడు?

వీళ్ళు పన్నెండువేలు అడిగారు. పిల్ల తండ్రి పదివేలు ఇస్తానన్నాడు. "అబ్బాయి చదువుచూసి ఇంతకట్నం ఇవ్వాల్సిందే గాని వెనక సెంటుభూమిగాని, పడిపోయిన పెంకుటిల్లుగాని లేదు నేను ఆడపిల్లలు గలవాడ్ని అంతకంటే ఎక్కువ నావల్లకాదు" అన్నారు మధ్యవర్తితో రామనాథం "ఏదో కుర్రాడు బుద్ధిమంతుడు పెద్దచదువు చదువుతున్నాడు పిల్ల సుఖపడుతుందని గాని అసలు నా స్థోమత్తుకి ఇదే ఎక్కువ. ఇంకా నాకు ఆడపిల్లలున్నారు వాళ్లకి ఓ దారి చూపాలి కదా" అన్నారు సబబే అనిపించింది ఆయనకి. "పిల్ల రత్నం. అన్ని విధాల మేలయిన సంబంధం. ఒప్పుకోవటం మంచిది" అని రాయభారం నడిపాడు. అందుకే పూర్తి అంగీకారంతో రామారావు గారు ఒప్పుకున్నారు శ్రీనివాస్ అభ్యంతరం చెప్పలేదు శ్రీనివాస్ తల్లి రాజ్యలక్ష్మమ్మకి కూడా కోడలు నచ్చింది.

"ఆశకి అంతెక్కడ? పదివేలయినా ఫరవాలేదు. వాడి రెక్కలే కదా ఆ పిల్లకి ఆధారం" అనుకుంది ఆవిడ.

తరువాత పెళ్లికొడుకు తల్లి, అప్పగారు ఇంకా ఎవరెవరో వచ్చి అనూరాధని చూసుకున్నారు పిల్ల లక్షణంగా వుంది. సంప్రదాయం మంచిది. అని పెళ్లి నిశ్చితార్థం చేశారు శ్రీనివాస్ కి మాత్రం — తనకి ఆ పిల్లతో పెళ్లి—అనుకుంటే కాని పనేదో జరిగిపోతున్నట్లు దిగులుపట్టుకుంది.

"పిల్లకి ఇప్పట్లో పెద్దగా నగలు పెట్టే స్థోమతు లేదు. ఒక జత గాజులు పెడతాం. ముందు ముందు అబ్బాయి సంపాదిస్తే సుఖపడేది మీ పిల్లేకదా! అప్పుడు వాళ్లే చేయించుకుంటారు" అన్నాడు వియ్యంకుడు లౌక్యంగా "అబ్బే ఛ్ఛే ఎంతమాట" అన్నారు రామనాథం గారు

అందం, చదువు వున్న బృహస్పతి లాంటి




# ఎమెస్కో పాఠకులకు ప్రత్యేక అవకాశం




అన్నిటి ధరలు హెచ్చిపోయి పుస్తక ప్రచురణ సాగించడం కష్టతరమైన కారణంగా ఎమెస్కో సంస్థ, ఇదివరలో వెలువరించిన పుస్తకాలన్నిటి వెలలు కూడా పెంచబోతున్నది ఈలోగా వెనుకటి ప్రచురణలు కోసం ఎమెస్కో పుస్తక ప్రియులు వాటిని వెనుకటి ధరలకే కొనగల్గడానికి వీలుగా వారికి సెప్టెంబరు 30 వరకు అవకాశం ఇస్తోంది. ఈ సందర్భంలో ఎమెస్కో పాకెట్ బుక్స్, సంప్రదాయ సాహిత్య ప్రచురణలతో సహా మా యం. శేషాచలం అండ్ కో ప్రచురణలన్నీ మా ఏజెంట్లు అందరివద్ద లభించే ఏర్పాటు చేశాం పాత ప్రచురణలు కావలసినవారు, వారి సమీపంలోని మా ఏజంట్లద్వారా పొందవచ్చు. ఆ సదుపాయం లేనివారు సరాసరి మాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును. పదిహేను రూపాయల పుస్తకాలు కొనువారికి పోస్టేజి ఉచితం. ఎమెస్కో పుస్తకాభిమానులు త్వరపడి ఈ ప్రత్యేకావకాశాన్ని వినియోగించుకొని లాభం పొందగలరని ఆశిస్తున్నాము.



ఉన్నవ విజయలక్ష్మి
సుజాత - రు 5/-



సి.పి. బ్రౌన్
తాతాచార్ల కథలు
రు 5/-

జయశంకర ప్రసాద్
కామాయని
రు 5/-



మాదిరెడ్డి సులోచన
అందని పిలుపు
రు. 3.50

## ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

రాష్ట్రపతి రోడ్ - సికింద్రాబాద్

భర దొరుకుతున్నాడు నగలదేముందిలే అని సరిపెట్టుకున్నారు.

ఇప్పటి పద్ధతుల ప్రకారం పదివేలూ తీసుకుని పసుపుకొమ్ము కట్టినా అడిగే హక్కులేదు. ఇంకా వీళ్ళ నయమే !

## లాలస

కోడలుకి పెద్దగా నగలు పెట్టలేక పోవటం రాజ్యలక్ష్మమ్మకి చిన్నతనంగానే వుంది. కాని ఏంచేస్తాం ! ఎంత కాదన్నా



2, 3 వేలు పెళ్ళికి ఖర్చు అవుతాయి. తక్కిన సొమ్ము వాడి చదువు కావాలి. ఇంకా బోల్డు అప్పులున్నాయి కదా ! అని సరిపెట్టుకుంది.

"పెళ్ళికొడుకు చదువు అయ్యేవరకు పిల్ల అత్తగారింట్లోనే వుంటుంది. ఆ తరవాత అతనికి ఎక్కడ వుద్యోగం అయితే అక్కడ వుంటుంది" అన్నాడు మధ్యవర్తి.

"మరి అంతే కదా" అంది సుభద్రమ్మ.

పెళ్ళి నిశ్చయమైందంటే కొండంత సంబరం వచ్చింది ఆవిడకి. వరకట్నం శక్తికి మించినదే అయినా ఆవిడకి తృప్తిగ వుంది. అల్లుడు కంటికి నిండుగా వున్నాడు. పిల్ల సుఖపడుతుందని సంతోషించింది. "మా అల్లుడు డాక్టరు చదువుతున్నాడు. పదివేలు కట్నం ఇస్తున్నాం" అని ఇంటింటికి వెళ్ళి చెప్పొచ్చింది.

రామనాథం తెలివిగా ఆడపిల్లలపేర్న మీద 'క్యూములేటివ్ డిపాజిట్లు' కట్టాడు. ఆఖరి పిల్లపేరు మీద లేదుగాని పై ముగ్గురికి వుంది. ప్రస్తుతం అనూరాధ పేరుమీద ఏడు వేలదాకా వుంది. ఇంకా నాలుగయిదువేలయితే శుభకార్యం గట్టెక్కిపోతుంది. అనుకుని ఇంటి మీద అప్పు తెచ్చాడు.

ఇంటిల్లిపాదికి ఈ సంబంధం నచ్చింది. చాలా సంతోషంగా వున్నారు.

"నీ సంగతేమో కాని మా బావగారు డాక్టరంటే మాకెంత గొప్పో తెలుసాఅక్కా" అన్నాడు రమణ.

లక్ష్మి కించిత్ ఈర్ష్యగా చూసింది మరి దానిభర్త రాము బి. కాం. చదివి అక్కౌంటంట్ జనరల్‌లో యు. డి. సి.గ చేస్తున్నాడు "ఎంతైనా బావ డాక్టరు. అక్క అదృష్టవంతురాలు" అనుకుంది. సుందరికి ఇవేవి పట్టవు. ఆమె కంటికి 'కృష్ణ' తప్పించి ఇంకొకళ్ళు ఆనరు.

నిజానికి వాళ్ళ నలుగురాడపిల్లల్లోకి అనూరాధ బాగాపొడుగ,నిండుగ,అందంగవుంటుంది చూడగానే అణకువ, ఓర్పుగల పిల్లలా కనిపిస్తుంది. లక్ష్మి ఫరవాలేదు. కాని సుందరి అనూరాధ తరవాత ఆకర్షణీయంగా కంటికి నదురుగా వుంటుంది. ఏ ఫాషన్ అయినా ఆ చిన్నదానికి నప్పుతుంది. ఎబ్బెట్టుగ అనిపించదు. అల్లా అని బెల్‌బాటమ్సు, జీన్సు వేసుకోదు. చీరలు లంగాలే. కాని అందులోనే ప్రత్యేకత కనుపించేలా అలంకారం వేసుకుం

టుంది పత్తుగా వుండే జుట్టు, సోగ కళ్ళు ఆ పిల్లకి పెట్టని ఆభరణాలు.

సుభద్రమ్మ మంచిరోజుచూసి విఘ్నేశ్వరుడికి బియ్యం పోసింది. పెళ్ళి పన్లు మెల్లిగా మొదలు పెట్టారు. సాయంగా వుంటుందని అనూరాధ మేనత్త, సుభద్రమ్మ అక్క కనకమ్మ వచ్చారు రామనాథం ధాన్యం పురి విప్పించి 5, 6 బస్తాల ధాన్యం ఆడించారు. అప్పడాలు వడియాలు పెట్టటం, అటుకులు కొట్టించటంతో సతమతమయ్యారు ఆడవాళ్ళు.

ఓరోజు బజారుకెళ్లి అనూరాధ, పిల్లలు బట్టలు తెచ్చుకున్నారు. ఆ మర్నాటి నుంచి లంగాలు, జాకెట్లు కుట్టుకోవటం తోటే వాళ్లకి పొద్దు గడిచిపోయేది ఆడపిల్లలు గల ఇళ్లని సుభద్రమ్మ మహిళా మండలి ద్వారా 'విద్యా' కుట్టుమిషను 'ఆఫ్ పేమెంటు' మీద వస్తుంటే కొంది. బయట వాళ్లకి కుట్టరు గాని ఇంట్లోవాళ్ల బట్టలన్ని వాళ్లే కుట్టుకుంటారు. మగపిల్లలవి టైలరుకి ఇస్తారు. తెలుసుకుంటే పెద్ద సంసారాల వాళ్లకి కుట్టుమిషను సగం ఆదా! ఇంటికి సున్నాలు వేయించారు ఇంటిముందు నిలువెత్తు గుంజలు పాతి పందిరేయించారు. లగ్నాలు పెట్టుకున్నాక ఆగుతాయా? పెళ్లి రోజు రానే వచ్చింది. 'డిబ్బు...డిబ్బు" మనిపించకుండా వున్నంతలో బాగానే జరిపించారు రామనాథంగారు తొలిచూలుపిల్ల కావటంతో డబ్బు సర్దుబాటు బాగానే అయ్యింది—అనూరాధకి మెళ్లో మూడు సవర్ల గొలుసుతో కన్యాదానం చేశారు — అందుకే "ముందు వాళ్లకి మూకుళ్లు – వెనక వాళకి చప్పట్లు" అంటారు.

అనూరాధకి అత్తారు ధర్మవరం పట్టు చీరలు రెండు, ఒక ఫారిన్ నైలక్సు చీర పెట్టారు మిరియం కటింగులో వున్న జత బంగారం గాజులు పెట్టారు అనూరాధ మేనమామ హెచ్. ఎం. టి. వాచీ కొని పెట్టాడు.

వున్నంతలో పెళ్లి ఘనంగానే జరిగింది మగపెళ్లివారు కూడా తృప్తి పడ్డారు మొత్తానికి అనూరాధ మెళ్లో మూడుముళ్లు పడ్డాయి. పెళ్లికొడుకు కొంచెం ముక్తసరిగా నిర్లిప్తంగా వుండటం అనూరాధకి నచ్చలేదు అతని నిరసన ఆమెకి మనసులో ముల్లులా బాధించింది తనపై మనసు లేదేమోనని భయపడింది. అతని తరహా అంతేనేమో! అని సర్దుకుంది. దిగితేగాని లోతు తెలియదు!

"ఆ కాస్త అడ్డు కూడా తొలగించేస్తే అయిపోతుందిగా అన్నారు" రామనాథం.

"పిల్లని శ్రావణమాసం వెళ్లగానే తీసుకెళ్లిపోతాం. మంచిరోజు చూసి మా ఇంట్లో చేసుకొంటాం లెండి. మీరు మరోలా అనుకోవద్దు" అన్నాడు వియ్యంకుడు.

"అల్లుడు డాక్టరు. ఇటువంటి ఆర్భాటాలు నచ్చవేమో" అనుకుని సరిపెట్టుకున్నారు.

పదహారు రోజుల పండుగ వెళ్లగానే ఎక్కడి వాళ్లక్కడ సర్దుకున్నారు.

* * *

"శాంతా... లే .లే .అమ్మకి వొంట్లో బాగుండలేదుట" అంటూ చెల్లెల్ని తట్టి లేపాడు రామం. శాంత బద్ధకంగా లేచి బాత్ రూమ్‌లోకి దారితీసింది

మేనకోడలు పెళ్లి చేసివచ్చాక సీతమ్మకి వళ్లు పట్టుకుపోయింది ఆవిడ నడుం కట్టే పూనుకోబట్టే సగం పన్లు సవ్యంగా జరిగాయి నెల్లాళ్లు అక్కడ గడిపి ఇంటికి వచ్చాక వారం రోజులు పడకేసింది.

"మేనకోడలు పెళ్లికే అంత అలిసిపోతే రేపు శాంత పెళ్లికేం చేస్తావ్" అన్నాడు సత్యనారాయణ ఆవిడకి 35 ఏళ్లు పెద్ద వయసేం కాదు. అయినా ధాటీ పోటీలకి తట్టుకోలేని ఆరోగ్యం. కూతురు పెళ్లి చేసేస్తే త్వరలో రామం పెళ్లిచేసి లక్ష్మిని కాపురానికి తీసుకొస్తే ఆవిడకికాస్త విశ్రాంతి చిక్కుతుంది. శాంతకి సంబంధాలు వెతుకుతున్నారు. ఆ పిల్ల పది చదువుతోంది.

కాఫీ తాగి తల్లిని రిక్షాలో హాస్పటల్ కి తీసుకెళ్లాడు రామం. సత్యనారాయణ స్నానం చేసి పూజముందు కూర్చున్నాడు. ఆయన ఉదయం ఓ గంట సాయంత్రం ఓ గంట దేవతార్చన జరపాల్సిందే!

శాంతకి వంట చేయాలన్నా పనన్నా తగని విసుగు! తల్లి బయటచేరిన మూడురోజులు వంటఇంట్లో గిన్నెలు 'తధిగిణ తోం' పాడతాయి ఒక్కర్తే కూతురు కావటంతో కొంచెం గారాబం అయ్యింది. సీతమ్మకి తొలిచూలు రామం. తరువాత నాలుగేళ్లకి శాంత పుట్టారు అంతే మళ్ళీ కానుపు రాలేదు. అందుకే రాబడి తక్కువయినా ఏ లోటూ లేకుండా హాయిగా ఉన్నారు

శాంతకి అత్తయ్యగారింటికి వెళ్లాలంటే మహా హుషారు. అన్నయ్యకి తొందరగా పెళ్ళి అయితే బాగుణ్ణు ఇక్కడికి లక్ష్మి వచ్చేస్తుంది అనుకుంటుంది. కాని తన పెళ్ళి తరవాతే అన్నయ్యపెళ్ళి అనుకుంటే ఆపిల్లకి నిరాశగ వుంది. తనకి పెళ్ళి అయితే వదినతో తను సరదాగా వుండే దెంతకాలం? అని ఆ అమ్మాయి బాధ.

శాంత కొంచెం అమాయకురాలు. అంటే తెలివితక్కువతనంకాదు బాగా 'ఇన్నోసెంటు' అన్నమాట తెల్లనివన్నీ పాలు అని భ్రమిస్తుంది. అరమరికలు లేకుండా అందరిలోటి అన్ని మాట్లాడుతుంది. ఆఖరికి స్కూల్లో కూడా అంతే ఇటు మగపిల్లలతోటి అటు ఆడపిల్లలతోటి సరిసమానంగా వ్యవహరిస్తుంది "స్నేహానికి ఆడ మగ తేడా ఏమిటి?



**4-10-1974 శుక్రవారం మొదలు**
**10-10-1974 గురువారం వరకు**

# వారఫలం

—మహేష్

**మేషం :—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది ప్రయాణాలు ఫలిస్తాయి రావలసిన డబ్బు అందుతుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు వృత్తిలో పోటీవారిపోటీ తగ్గుతుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు

**వృషభం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి నూతన వ్యవహారాలు లాభిస్తాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి విలాస వస్తువులు కొంటారు

**మిథునం :—** మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి పోటీవారిలో గౌరవ ప్రాబల్యాలు బాగుంటాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**కర్కాటకం —** రావలసిన డబ్బు అందుతుంది వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**సింహం —** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది మీ ప్రయత్నాలు ఫలించగలవు సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**కన్య :-** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు మిత్రులకు సహాయం చేస్తారు ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు దైవకార్యాలు నెరవేరతాయి

**తుల —** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి సాహసిక వ్యవహారాల్లో నష్టంరాగలదు వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలుబాగుంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు వృత్తిలో ఆదాయం పెరుగుతుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు బంధుమిత్రులను కల్సుకొంటారు

**వృశ్చికం —** మీ ఆలోచనలు ఫలిస్తాయి నూతన వ్యవహారాలు బాగుంటాయి వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు ప్రయాణాలు వాయిదా పడతాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి అనవసరమైన వ్యయం జరుగుతుంది

**ధనుస్సు —** ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు, పోటీ వారితో మాట పట్టింపులు తగవు ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి వృత్తిలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది దైవకార్యాలు నెరవేరతాయి

**మకరం —** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి ప్రయాణాలు ఫలిస్తాయి వారం మధ్యలో వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది కోర్టు వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి ఆడంబరంకోసం వ్యయం చేస్తారు స్త్రీలకు—బంధువుల నిమిత్తం శ్రమపొందవలసి వస్తుంది పుణ్యకార్యాలు చేస్తారు

**కుంభం —** మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు పోటీవారిలో గౌరవం బాగుంటుంది వారం మధ్యలో సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి మిత్రుల సహాయం లభించగలదు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది ప్రయాణాలు వాయిదా పడతాయి

**మీనం —** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి అనుకూల వార్తలను వింటారు వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు బంధు మిత్రలను కల్సుకొంటారు ●

---

## లాలస

అంతా కలిసి చదువుకుంటున్నప్పుడు అరమరిక లెందుకు ?'' అంటుంది ఆ అమ్మాయి స్వభావంలో లోపం కనిపెట్టి కొందరు కొంటెకుర్రాళ్ళు ఆమెని ఆటలు పట్టించేవారు ఒకసారి 'శ్రీహరి' అనేఅబ్బాయి మీద రిపోర్టు ఇచ్చింది శాంత 'అసంబ్లీ'లో ఆ అబ్బాయిని తిట్టి పదిమందిలో నూ 'అపాలజీ' కోరేటట్లు చేశాడు హెడ్‌మాస్టరు చాలా గొడవ జరిగింది. ఇంట్లో తెలిసి అన్నగారు తండ్రికూడా ఆపిల్లని కోపం చేశారు "జరిగిందేదో జరిగింది నువ్వు అసలు మగపిల్లలతో మాట్లాడట మెందుకు? మళ్లీ వాళ్ళేదో అన్నారని రిపోర్టు చెయ్యట మెందుకు? నీచదువేదోచదువుకుంటూక'' అన్నారు ఆ 'శ్రీహరి' అన్న కుర్రాడు ఇంటర్ ఫైనల్!

"ఇది వట్టి— అభం దాయి— తొందర్లో ఆ మూడుముళ్ళూ వేయించేస్తే వదిలి పోతుంది'' అంది తల్లి అప్పట్నుంచీ సంబంధాలు చూస్తూనే వున్నారు పదవ తరగతి పరీక్షలు కాగానే వేసంగిలో ఏదో ఒకటి చూసి ముడిపెట్టేస్తారు

ఎలాగో వంట అయిందనిపించి గదిలోకి వెళ్ళి లెక్కల పుస్తకం ముందు పెట్టుకొని కూర్చుంది శాంత

* * *

శ్రావణమాసం ఆకాశం నిండా మేఘాలు అందంగా పరుచుకుని టపటపా చినుకుల్ని రాలుస్తున్నా పేరంటాళ్ల హడావుడి మాత్రం తగ్గలేదు పట్టు చీరలు పైకెత్తి పట్టుకుని ఆ బురద నీళ్లల్లోంచి పసుపు కాళ్లతో వెళ్లాల్సిందే!

అనూరాధకి శ్రావణ మాసం నోము లు అత్తగారు వచ్చి 'శ్రావణపట్టీ' ఇచ్చి వెళ్లింది నోములు కాగానే మంచి రోజు చూసి పిల్లని దింపమని చెప్పి వెళ్లారు

ఆ రోజు ఆఖరి మంగళవారం ఆడపిల్లలంతా తలలంటుకున్నారు అనూరాధ నోము నోచుకుని తోరం కట్టుకుంది సాయంత్రం పేరంటం అత్తగారు పెట్టిన జరీ అంచు ఎర్రచీర కట్టుకుంది

అనూరాధ లక్ష్మి పీటలు ముందేసుకుని తమలపాకుల్లో వక్కలు పెట్టి మడిచి సన్నటి చీపురు పుల్లలు గుచ్చుతున్నారు వాడేసిన సెనగలన్నీ ప్లాస్టిక్ బకెట్‌లోకి ఎత్తింది లక్ష్మి అప్పుడే మూడు దాటుతోంది "ఆ రమణగాడు బొల్డు చామంతి పూలు తెచ్చాడు దండలు గుచ్చాలి ఈ సుందరి ఏం చేస్తోందో'' అంది అనూరాధ

సుభద్రమ్మ వంటగది శుభ్రంచేసి ఇవతలకి వస్తూ వాళ్ల మాటలు విని 'సుందరీ' అంటూ కేకేసింది

సుందరి దర్జాగా పడక కుర్చీలో పడుకుని

(44 వ పేజీ చూడండి)

*బావగారికి సీరియస్‌గా వున్నట్లు టెలిగ్రాం వచ్చింది. అది చూచి నాకే సీరియస్ అయినట్లనిపించింది.*

*మూడు సంవత్సరాలు నన్ను ప్రేమతో పెంచిన బావగారికి సీరియస్!* నా మనసంతా బాధాక్రాంతమైంది మా జిల్లా వెళ్లాలన్నా మాటలు కాదు

హైదరాబాద్ నుండి శ్రీకాకుళం ట్రైన్ థర్డ్‌క్లాసు టిక్కట్టు ముప్పై రూపాయ లుంది కనీసం వంద రూపాయిలు కావాలి నాకు పరిచయమున్న వారికి పరిస్థితి వివరించి అప్పు సంపాదించాను

నాంపల్లి స్టేషన్‌నుండి హైదరాబాద్–హౌరా ఎక్స్‌ప్రెస్ తొమ్మిది గంటల నలభై అయిదు నిముషాలకు బైలుదేరుతుంది నేను పనిచేస్తున్నది, హైదరాబాద్ జిల్లాలోని ఒక కుగ్రామం ఆ గ్రామం నుండి బయలుదేరి రాత్రి ఎనిమిది గంటలకే నాంపల్లి స్టేషన్ చేరుకునాను

నన్ను బస్సు ఎక్కిస్తూ "మనుషు లుంటారు జాగ్రత" అన్నాడు నాస్నేహితుడు ఆమాటకు ఎంత విచారంలోకూడా నాకు నవ్వొచ్చింది అతడన్న మాటను తలచుకుంటూ బుకింగ్ విండో దగ్గరికి వెళ్లి టిక్కట్టు తీసుకున్నాను ప్లాట్‌ఫారవ్‌మీదకు యింకా ట్రైను రాలేదు కడుపు ఆకలితో మండిపోతుంది ఎన్ని ప్లాలు వచ్చినా, సుఖాలు వచ్చినా తిండిబాధ మాత్రం తప్పదుకదా! స్టేషన్ వెలుపలికివచ్చి, హోటలులో భోంచేసి తిరిగి ప్లాట్‌ఫారవ్ చేరుకున్నాను అప్పటికే ట్రైను వచ్చి ప్లాట్‌ఫారంలో నిలుచుంది ప్రయాణీకులు




ఉత్సుకతతో ఇటు, అటు పచార్లు చేస్తున్నారు థర్డ్‌క్లాస్ కంపార్టుమెంటును చూచుకొని ట్రైనెక్కాను ఆ కంపార్టుమెంటులో స్థలాలన్నీ ఆక్రమింప బడినై కొందరు (బ్రోకర్లు) సామాన్లు పెట్టుకుందికి ఏర్పాటుచేయబడిన మీది సీట్లమీద దుప్పట్లు పరిచేరు ఆసీట్లను ప్రయాణీకులు డబ్బుయి పెట్టి కొనుక్కుంటున్నారు రాత్రిప్రయాణం కాబట్టి నడుం వాలుద్దా మనుకున్న వారు ఆసీట్లు బేరం చేస్తున్నారు ఒక్కొక్క సీటుకు ఐదు రూపాయిలు వరకు యిస్తున్నారు నాకు ఆశ్చర్యం, అసహ్యం కలిగినై ఒక మూల చిన్నసీటు చూచుకొని కూర్చున్నాను

ఎక్కుతున్న వారు, దిగుతున్నవారితో కంపార్టుమెంటు చాలా గందరగోళంగా వుంది ప్రయాణీకుల కంటే, వారిని వీడ్కోలు చెప్పడానికి వచ్చిన వారి గొడవే ఎక్కువగా వుంది "జాగ్రత్తగా ప్రయాణంచేయ"ని చెప్పేవారు "ఉలాగేనని" తలూపు వారు "వుత్తరం వ్రాయమని" అడగుతున్న వారు చేతిలో చేయికలిపి వీడ్కోలు తీసుకుంటున్నవారు, ప్లాట్‌ఫారం నిండా నిండుకున్నారు నేను, దృష్టిమరల్చి నా థర్డుక్లాస్ కంపార్టుమెంటులోని చూచేను రోగాల మూలుగులతో, ఏడుపుల శబ్దాలతో "కూర్చో", "సర్దుకో" "ఫో ఫో" "ఈ ట్రైను నీదా" అన్న మాటలతో కంపార్టుమెంటంతా గందరగోళంగా వుంది ఒక పెద్దసూట్‌కేస్ పట్టుకొని ఒక పదిహేనేళ్ల అబ్బాయి లతికష్టంమీద ఆ కంపార్టుమెంటులోనికి వచ్చేడు అతని వెనుక, నల్లని బట్టలను "టక్"చేసుకొని ఒక ముప్పైఏళ్ల వ్యక్తి వచ్చేడు ఇద్దరూ రెండుసీట్లలో కూర్చున్నారు ఆముప్పైఏళ్లవ్యక్తి నల్లగా, పొడుగ్గా వున్నాడు

సరిగ్గా తొమ్మిది గంటల నలభైఐదు నిముషాలకు ట్రైను కూత పెట్టుకుంటూ నాంపల్లి స్టేషన్ నుండి బైలుదేరింది

కంపార్టుమెంటులోనికి ఎక్కిన ఆ నల్లటతను గొంతుసవరించుకున్నాడు "బాబులూ! మంచి, మంచి టార్చిలైట్లు, స్టీలుసామాన్లు దుప్పట్లు, షర్టుగుడ్డలు, అగ్రాజా పెడుతు

# నైసిల్*
# 'శాండల్‌వుడ్'
## మీ చర్మాన్ని రక్షిస్తుంది మీకు తాజాతనం ఇస్తుంది.

సంవత్సరమంతా మీ చర్మాన్ని చురుకుగా ఉంచి
సంరక్షించుటకు ప్రత్యేకమైన పదార్థములు
కలిగియున్నది నైసిల్ ఒక్కటే దుర్గంధము
కలిగించే సూక్ష్మజీవులను నాశనం చేయగల
క్లోరోఫెనెసిన్ కలిగియున్నది చెమటను
పీల్చుకొనుటకు ప్రత్యేక విధముగా తయారు
చేయబడిన పౌడరు, స్వల్పమైన దురదలను,
అంటువ్యాధులను రాకుండా అరికట్టుతుంది
అంతేకాదు! మనోహరమైన చందనపు
సువాసన కలిగి ఉన్నది మీకు తాజాతనం—
నిజమైన తాజాతనం ఇచ్చును!

*మీ చర్మానికి అవసరమైన ఔషధీయుక్త
గుణవంతమైన నైసిల్
'శాండల్ వుడ్'ను
ఎన్నుకోండి.*




Sista's-GN-154 TEL

**నైసిల్**
'శాండల్‌వుడ్'
ఔషధీయుక్తమైన పౌడరు
గ్లాక్సో తయారీ
*ట్రేడ్ మార్క్

న్నాను (అ(రాజంటే వేలం) పాటమీద పాట పెట్టండి వస్తువుధర మాకు కిట్టుబాటైతే మీకిచ్చేస్తాను లేనిపక్షంలో ఒక దువ్వెన, ఒక పెన్సిలు, ఒక అద్దం, ఒక మనీపర్సు మీరు పాడినందుకు బహుమతి యిస్తాను పేదవాడిని మీరు పాడినంతకే యివ్వాలంటే నాకడుపు గడవదు '' అంటున్నాడు సూట్ కేస్‌తో ఎక్కినతను, సూట్ కేస్ తెరచి ఐదు సెల్సు టార్చిలైటు అతనికి అందించేడు.

''ఐదు సెల్సు టార్చిలైటు, జీవ్ కంపెని పచీస్(ఇరవై ఐదు )రూపాయలఖరీదుది పాట పెట్టండి నాకు కిట్టు బాటుకాని పక్షంలో ఒక దువ్వెన బహుమతి తీసుకోండి'' గట్టిగా అరుస్తున్నాడు నల్లటతను

ఎవరోరెండురూపాయలని కేకవేసారు

''రెండు రూపాయలు, .రెండు రెండు''

వేరొకరు నాలుగు రూపాయలన్నారు

''నాలుగు నాలుగు . ఇరవై ఐదు రూపాయిల టార్చిలైటుకు పాట నాలుగు నాలుగు '' నాముందు కూర్చున్నతను ఐదు రూపాయిలన్నాడు

''ఐదురూపాయిలు .. టార్చిలైటుకు పాట ఐదురూపాయలు '' గట్టిగా అరుస్తూ టార్చిలైటును ప్రయాణీకులకు చూపుతున్నాడు. పాట ఎనిమిది రూపాయిల వరకు వెళ్లింది.

''ఇరవై ఐదు రూపాయిల టార్చిలైటుకు ఎనిమిది రూపాయలు, ఒకటోసారి ఎనిమిది, . రెండవసారి ఎనిమిది మూడవసారి ఎనిమిది రూపాయిలు'' అంటూ పాట ఆపేడు. సూట్ కేస్ పట్టుకున్నతడు దువ్వెనఅందించేడు ఎనిమిది రూపాయలకు పాట పాడినా తనకి దువ్వెనయిస్తూ ''బాబూ పచీస్ రూపాయిలు ఖరీదుచేసే టార్చిలైటు ఎనిమిది రూపాయిలకు రాదుబాబూ'' అన్నాడు నల్లటాయన

వేరొక షర్టు బట్టతీసి వేలం పెట్టేడు. ఆబట్టకు పాట తొమ్మిది రూపాయిల వరకు వెళ్లింది దాన్నికూడా అతను యివ్వకుండా ఒక చిన్న అద్దం, ఎక్కువ పాడినవానికిచ్చేడు అంతవరకు అతనివేపే నిలిపిన నా దృష్టిని ప్రక్కకు మరల్చుకున్నాను. రంగు రంగు దీపాలలో హైదరాబాదు జిగేల్ మంటుంది కిటికీగుండా ఆ నగర సౌందర్యం నన్ను పారవస్యంలో ముంచింది. ''ధన్'' మన్న పెద్ద శబ్దంతో వులిక్కిపడి మళ్లీ కంపార్టుమెంటులోనికి దృష్టి మరల్చేను.

## కోటివిద్యల్లోలేనికొత్తకూటివిద్య

నల్లటతనను స్టీలుపళ్లెం తీసి, కంపార్టుమెంటులో వున్న క(అ చెక్కకికొడుతూ దాని గట్టిదనాన్ని ప్రయాణీకుల కందరికీ తెలియ బఱచేడు. దాన్ని అందరూ పరీక్షిస్తున్నారు. దానిఖరీదు నలభై రూపాయిలైనా ఔతుందని వివరించేడు. నాదగ్గరగావచ్చి దాన్ని పరీక్షించమన్నట్లు నాచేతికి యివ్వబోయాడు. నేను దాన్ని చేతితో పట్టుకోలేదు.

''కొనవలసిన అవసరంలేదండీ! సరుకును పరీక్ష చేయండి!'' అన్నాడు. దాన్ని పరీక్షించి తిరిగిచ్చేను. ఆస్టీలు పళ్లెంకు పాట ఐదు రూపాయిలవరకు వెళ్లింది. ఆ నల్లటతను ఆపాటకు ఒక పెన్సిలు బహుమతి యిచ్చేడు.

తరువాత స్టీలుడబ్బా, రెండు చిన్న కప్పులు పాటపెట్టేడు. దానికి కూడా బహుమతే యిచ్చేడు. స్టీలుపళ్లెం, స్టీలు డబ్బా, రెండు చిన్నకప్పులు అన్నీకలిపి మళ్లీ పాటపెట్టేడు

### మినీ యింటర్‌వ్యూ



'తెలుగు సినిమాలలో యువతరానికి ప్రోత్సాహం లభిస్తేగానీ తెలుగు సినిమాలు మంచివి రావు! అటువంటి ధోరణి ఈమధ్య కనిపిస్తోంది! నీడలేని ఆడది, ఓ సీతకథ ఇందుకు నాందీగీతం పలికాయి! ...' అన్నాడు బి కామ్ ప్యాసయిన జి వి ఎల్ నారాయణరావు

నాటకాల్లో వేషాలేస్తాడు కథలు రాస్తాడు పెయింటింగ్స్ వేస్తాడు ప్రేమలో పడ్డాడు! కానీ— పెళ్లి వరకూ వెళ్లలేకపోయాడు

అక్కినేని, శత్రుఘ్న సిన్హాలంటే అభిమానం! ఎం ఏ చదువుకుంటున్న 'జీ వీ'కి సినిమాల్లో విలన్ వేషాలు వేయడం — లేదా పోలీస్ డిపార్టుమెంటులో ఆఫీసర్ అవాలన్నదే ఆశయం... [గీతా ఫీచర్స్]

''ఎనభై రూపాయిలు ఖరీదుచేసే స్టీలు సామాన్లకు పాటపెట్టండి. ధరకిట్టనిపక్షంలో ఎక్కువగా పాడిన వారికి రెండు రూపాయల ఖరీదుచేసే పర్సు బహుమతి యిస్తాను.'' అంటూ ఒక పర్సు వెలికితీసి అందరికీ చూపెడతను. మనీపర్సుచాలాఅందంగా వుంది.

''పదిరూపాయలు'' అన్నారొకరు.

''పదిరూపాయిలు...పది ఒక స్టీలుపళ్లెం, స్టీలు డబ్బా, రెండు స్టీలు కప్పులు మొత్తం ఎనభై రూపాయలు ఖరీదుచేసే సామాన్లకు అ(రాజు పదిరూపాయలు... పది... పది...'' అరుస్తూనే వున్నాడు.

వేరొకతను ''పన్నెండ''ంటూ అఱిచాడు.

''పన్నెండు ... పన్నెండు ... పన్నెండు రూపాయలు '' అంటూ అఱుస్తూనే వున్నాడు ఆపాట పద్దెనిమిది రూపాయల వరకు పోయింది

''పద్దెనిమిది పద్దెనిమిది పద్దెనిమిది'' కేకలువేస్తూ నావైపు చూచేడు నేనాశ్చర్యంగా అతని ముఖంలోనికి చూచేను అతను వేరేవైపుకు ముఖం త్రిప్పుకొని

'పంధొమ్మిది . పంధొమ్మిది పంధొమ్మిది '' అంటూ అరుస్తున్నాడు పంధొమ్మిది రూపాయలకు ఎవరు పాడేరో నాకర్థం కాలేదు

''ఒకటవసారి పంధొమ్మిది. రెండవసారి పంధొమ్మిది మూడవసారి పంధొమ్మిది'' అంటూ నావైపుతిరిగి ''పంధొమ్మిది రూపాయిలకు ఇవి రావుసార్ పాడినందుకు ఈపర్సు తీసుకోండి'' అంటూ పర్సు నామీదకు విసిరేడు

''నేను పాడలేదు '' అంటున్నాను నేను. ఆ వేలాం వ్యక్తి నామాట వినిపించుకోలేదు వేరే వ్యక్తితో మాట్లాడుతున్నాడు అంతలో ఒకతను వుర్దూలో మాట్లాడుతూ, ''వాడి దగ్గర అన్ని పైసాలున్నాయా ? లేకుండా పాడేడు'' నన్ను చూపిస్తూ వేలాం వ్యక్తితో అన్నాడు ఆమాట అన్నవ్యక్తి బెల్‌బాటం పేంటు, హిప్పీ హెయిర్‌కటింగ్స్‌తో చిన్నరకం రౌడీలా కనబడుతున్నాడు

''ఏమిటలాగంటావు ఆసార్ దగ్గర పైసాలులేవా'' అని నావైపు తిరిగి ''ఏంసార్ మీదగ్గర పంధొమ్మిది రూపాయలు లేవా?'' అని ప్రశ్నించాడు వేలాం వ్యక్తి. నన్నొక విధమైన సిగ్గు ఆవరించుకుంది

(46 వ పేజీ చూడండి)

# మీ ప్రత్తి దిగుబడిని 20% దాకా అధికం చేసుకోండి

# మొక్కల హార్మోన్ ఎసిమోన్ వాడండి




అంటే మీకు ఎక్కువ కాయలు లభిస్తాయన్న మాట. ప్రత్తి యేకుల పరిమాణం కూడా బాగా పెరుగుతుంది. ఫలితంగా మీరు అధిక దిగుబడిని సాధిస్తారు.

**ఎసిమోన్ అంటే ఏమిటి ?**

ఎసిమోన్ సహజంగా మొక్కల పెరుగుదల రేటును, స్వభావాన్ని అదుపులో ఉంచే సహాయక పదార్థాలవంటి పదార్థాలుగల సింథెటిక్ మిశ్రమము దీనిని ఒకసారి మొక్కలపై చల్లితే మొక్కలు భూమిలో నుండి పోషక పదార్థాలను అత్యధికంగా గ్రహించేటట్లు చేస్తుంది.

**మీరు అనుకుంటున్న దానికంటె ఆదా అయినది**

ఎకరానికి ఒకే ఒక ఎసిమోన్ సీసా చాలు ఇది కీటక నాశనులు, ఎరువులకు అనుగుణ్యమైనదే గనుక శ్రమ, ఖర్చు కూడా బాగా ఆదా అవుతుంది

ఎసిమోన్‌ను పొగాకు, మిరప, మామిడి, అనాస, ఆపిల్, పియర్స్, బంగాళాదుంప, గులాబీ, రబ్బరు, గోధుమ, వరి, జొన్న, చెరకు మరియు ఎన్నో ఇతర పైర్లపై కూడా వాడవచ్చును

మీ ప్రత్తి పైరుపై ఎసిమోన్ చల్లి, జరిగే మార్పును మీ అంతట మీరే చూడండి. సామాన్యంగా రెండు, మూడు పూవులు వేసే కొమ్మపై 5 లేక అంతకన్న ఎక్కువ పూవులు పూయడం జరుగుతుంది—పూవులు రాలి పోవడం కూడా చాలా వరకు తగ్గిపోతుంది.



**దేవిదయాల్**
**ఎగ్రో కెమికల్స్**

దేవిదయాల్ (సేల్స్) ప్రైవేట్ లిమిటెడ్ వారి
విభాగము
గుప్తా మిల్స్ ఎస్టేట్, రే రోడ్, బొంబాయి-400 010

**తెగుళ్ళ వినాశనులు లభించే అన్ని షాపులలోనూ సులభంగా దొరుకుతుంది.**

ప్రాంతీయ కార్యాలయం మె. దేవిదయాల్ (సేల్స్) ప్రై. లి., కుమార్ మాన్షన్, 5—9—164, చాపల్ రోడ్, మాడర్న్ ..., హైదరాబాద్—500001.
బ్రాంచి కార్యాలయం మె. దేవిదయాల్ (సేల్స్) ప్రై. లి., 27—10—32, ... రత్నయ్య వీధి, గవర్నరుపేట, విజయవాడ—520002
డీలర్లు : 1 శ్రీ ... ఆగ్రో సర్వీసెస్, (ఎ) ... పెదనందిపాడు, గుంటూరుజిల్లా, పిన్ 25, (బి) 26—1—90, ..., గుంటూరు * 2 జయా ఆగ్రో కెమికల్స్, మెయిన్‌రోడ్, కాకినాడ * 3 ... ఏజన్సీస్, ప్రకాశం మున్సిపల్ మార్కెటు ..., తాడేపల్లిగూడెం, పశ్చిమ గోదావరి * 4 ... కొండారెడ్డి & కో, మహబూబ్‌నగర్ * 5 ... లక్ష్మయ్య & సన్స్, నల్గొండ * 6 ... & కో, గాంధి రోడ్, కరీంనగర్ * 7 పార్థసారధి & కో, బషీర్‌బాగ్, హైదరాబాద్ * 8 ... ఆగ్రో ఏజన్సీస్, ఖమ్మం

mcm/dac/1 c te

# పుత్తడి బొమ్మ

సీరియల్

రామవరపు వేణుగోపాలరావు

*(గత సంచిక తరువాయి)*

**గో**డకి చేరబడి కూర్చున్న రాములు నెత్తిమీదున్న గూట్లో చెయ్యి పెట్టి పొగాకుకాడ అందుకున్నాడు. తాపీగా చుట్ట చుట్టి దీపం చేతిలోకి తీసుకుని చుట్ట అంటించుకున్నాడు. రెండు దమ్ములు పీల్చేక చలి పారిపోయినట్టనిపించింది. ఎడంచేత్తో ఛాతీమీద రాసుకున్నాడు ... నులక మంచంమీద పడుకున్న చుక్కని చూస్తుంటే పదేళ్ల కిందట చచ్చిపోయిన పెళ్లాం దాలమ్మ గుర్తుకొచ్చింది చుక్కమ్మ అచ్చు తల్లి పోలికే. తల్లి నోట్లోంచి వూడిపడ్డట్టు వుంటాయి దాని రూపురేఖలు.

"అమ్మి కెలాగేనా గొట్టాలమ్మ పండగ ఏలకి కోక తెస్తాను. తలమ్మిసేనా కొంతాను.' అని మరోసారి గట్టిగా అనుకున్నాడు.

"ఈ లోపల బుగతని యింకోసారి అడిగి సూత్తాను" అని నిర్ణయించుకున్నాక మరో రెండు దమ్ములు లాగి, చుట్టని ఆర్పేసి, గూట్లో పెట్టేడు.

"ఓలమ్మి... ఒలే సుక్కా!" అని కేకలు వేసి కూతుర్ని లేపేడు.

చుక్కమ్మ లేచి కూర్చొని కళ్లు నులుము కుంది. ప్రశ్నార్థకంగా తండ్రి మొహంలోకి చూసింది.

"కూడెట్టెయ్యే. మళ్లీ బుగతింటికి ఎల్లాల... పాలు పితికి, పేడ తీసి, పాకంతా ఊడ్వాల!" అన్నాడు. చుక్కమ్మ లేచి మూలనున్న గిన్నెని తండ్రి ముందు పెట్టింది బుట్టలోని ఉల్లిపాయ తీసి ఒలిచి చేతికిచ్చింది.

గంజినీళ్లల్లోని అన్నం మెతుకులు ఏరుకుంటూ, ఎడమ చేతిలో వున్న వుల్లిపాయ కొరుక్కు తింటూ 'కూడు' తినడం పూర్తి చేశాడు రాములు. కడిగిన చేతిని పై పంచెతో తుడుచుకుంటూ "అమ్మో, ధర్మిగాడుగాని ఒచ్చినాడేటి?" అనడిగేడు.

"నేదు" అంది చుక్కమ్మ ముక్తసరిగా.

"అమ్మో. ఆ డింటికి వొచ్చి ఎన్నాల్లయిందే?"

"ఓరం అవుద్ది కావాల!"

"శనెదవ నా కడుపున సెడబుట్టేడు. ఏలకి తిండన్నా తింటన్నాడో నేదో! అసలు తింటన్నాడో నేదో!" అని బరువుగా నిట్టూర్చేడు.

తడిసిన బనీను మళ్లీ తొడుక్కుని, నానిన గుడ్డని పిండి, దాన్నే మళ్లీ తలకి చుట్టుకున్నాడు. గూట్లో చుట్టముక్క కోసం చెయ్యిపెట్టి తడుముతుంటే తేలు కుట్టినట్టు ఉలిక్కిపడ్డాడు రాములు.

"నా కోక సంగతి ఏటి సేసేవురయ్యా?" అంది చుక్కమ్మ నులకమంచం పక్కనే నిలబడి, తండ్రివేపు చూడలేక చూస్తూ.

అలా అడిగిన చుక్కమ్మ వొళ్లు అప్పుడు మలేరియా జ్వరం వచ్చినట్టు వణకడం దానొక్కర్తికే తెలుసు. దాని గొంతులో పలికిన విషాదం, పలకలేక పలకలేక కదిలిన దాని పెదిమలకే తెలుసు. కోడెగాళ్ల చూపుల నుండి దాచుకోలేకపోయిన దాని యవ్వనం తల కొట్టేసినట్టు అవడం దాని చిరుగుల చీరకే తెలుసు. ఇవన్నీ పూర్తిగా కాకపోయినా, కొంతేనా, రాములికి కూడా తెలుసు.

కూతురి ప్రశ్నకి జవాబు చెప్పకుండా విసురుగా గొడుగు పట్టుకుని గుడిసెలోంచి బైటికి వచ్చేడు రాములు శివమెత్తినవాడిలా గవరయ్య బుగత ఇంటివేపు నడిచాడు. నడకలాంటి పరుగు పెట్టేడు. అంత గాలివానలో కూడా అతనికి వుక్క పోయసాగింది...బుగత ఇంటిముందున్న గొడ్లసావిడిలో గొడుగు దాచి, పనిలో పడ్డాడు.. పాలు పితికి బిందెని యింట్లో పెట్టేడు. పేడ తీసి మూలనున్న గంపలోకి ఎత్తేడు. చీపురుతో పాకంతా వూడ్చి, శుభ్రం చేశాడు. ఆవుల ముందు గడ్డి వేసేడు. అంతా అయ్యేక కాళ్లూ చేతులూ కడుక్కుని, బుగత ఇంటి ముని వాకిలి ముందు నిలబడ్డాడు.

ఆ సమయానికి — భోజనం ముగించి, కిళ్లీ బిగించి, ఒక చేతిలో గొడుగూ, మరొక చేతిలో బేటరీలైటూ పట్టుకుని 'బ్రేవ్' మని తేనుస్తున్న గవరయ్య బుగత గుమ్మంలో నిలబడి వున్నాడు. అతన్ని చూసి "నే నెల్తన్నాను బాబ్!" అని వెనుదిరగబోయాడు రాములు.

"సిన్న పని సేసి ఎల్లిపొమ్మిరా రాములూ!"

అప్పటికి రాత్రి పదైన సంగతి రాములికి తెలీదు. తెలిసినా, బుగత చెప్పిన పని చెయ్యక తప్పదు. ఏ రాత్రయినా, వానైనా, ఎండైనా, చేసి తీరవలసిందే!

గవరయ్య బుగత రాముల్ని సమీపించి రహస్యం చెప్తున్నట్టు "త్రినాదు తెలుసురా నీకూ?" అన్నాడు.

అంతే మెల్లిగా "తెలుసు బాబ్" అన్నాడు రాములు. అంతలోనే అనుమానం వొచ్చినట్టు "జగన్నాదసావిఁ కోవిలి పూజారేగదు బాబ్?" అనడిగేడు

"అవును." అన్నట్టు తలూపేడు గవరయ్య. "అల్లింటికెల్లి త్రినాదు పెల్లాం సావిత్రిని నేను రమ్మన్నానన్చెప్పు ... ఇదిగో సూడూ...నేనా కర్నం కనకయ్యగోరి ఇంటెనకాల మేడమీద గదిలో నుంటాను. పెరటికాసి రమ్మను. తలుపు తీసే వుంటాదన్చెప్పు! బేగి రమ్మను!"

"అలాగే బావూ" అని సమాధానం చెప్పిన రాములు, బుగతకి స్వామిభక్తి పరాయణుడైన ఆంజనేయుడిలా కనిపించేడు.

"ఈ కబురు సెప్పేసి, నువ్వెలిపో!"

"అలాగే బావు" అని నడవబోయిన రాముల్ని మళ్లీ ఆపేడు గవరయ్య.

"ఒరేయ్ రాములూ, ఇందరా, పువ్వాక్కాడ కొనుక్కో!" అని రాముల చేతిలో ఓ పావలా పెట్టేడు. గుప్పిట మూసేసి, "సెత్తం బావు!" — అని చీకట్లో, ఇంకా తగ్గని వానలో, కలిసి పోయేడు రాములు. గొడుగు చంకని పెట్టి పెదాల మీద పడుతున్న మీసాల్ని కుడి చేత్తో విలాసంగా దువ్వేడు గవరయ్య బుగత. దువ్వడం పూర్తయ్యేక గొడుగు విప్పి గుమ్మం దిగేడు.

* * *

ఇందాక పడినంత వుధృతంగా కాకపోయినా, వర్షం పడడం ఇంకా మానలేదు. గొడుగున్నా, తల తప్ప అంతా తడిసిపోవడంచేత నడుస్తున్న రాములు వణుకుతున్నాడు.

అతని వణుకుతున్న కుడిచేతి గుప్పిట్లో అర గంట కింద బుగత ఇచ్చిన పావలాకాసు భద్రంగానే వుంది. చీకట్లో తడుముకుంటూ నడిచి కరణం కనకయ్య ఇల్లు చేరుకున్నాడు.

పెరటి తలుపు తొయ్యగానే తెరుచుకుంది. లోపలికి అడుగేసి మళ్లీ తలుపు దగ్గరగా వేశాడు. అలికిడి విని పెరట్లో పాకలో నెమరేస్తున్న మొదవులు, రాముల్ని మొరలెత్తి చూసేయి. పాక చూరు

***జరిగిన కథ : 4*** సరస్వతమ్మ వ్యసనపరుడైన భర్త క్షయవ్యాధితో మరణించటంతో ఒంటరి దవుతుంది. కులం కానివాడిని పెళ్లి చేసుకున్న కూతురు జానకిని వెళ్లగొడుతుంది. 'లా' చదువుతున్న రవి, పెళ్లి చూపులకు పోవ నిరాకరించగా బాధ పడుతుంది కంబారి పుల్లిగాణ్ని దారుణంగా హింసిస్తున్న గవరయ్య బుగతని ఎదిరించి పుల్లిగాడ్ని విడిపిస్తాడు ధర్మయ్య. తల్లి వద్దంటున్నా అక్క జానకిని చూడటానికి వచ్చిన రవి రజనికి తాను ఆమెను ప్రేమిస్తున్నట్లు తెలియజేస్తాడు. ధర్మయ్యపై పగబడతాడు గవరయ్య బుగత

కింద వర్షంలో నానిపోతూ నిలబడివున్న లేగదూడ 'అంబా' అని అరిచింది. దూరంగా కప్పల బెక బెకలూ, కీచురాళ్ల గోలా వికృతంగా విన్పిస్తున్నాయి గోడవారనున్న మెట్లెక్కి మేడ చేరేడు రాములు. మీద ఒకటే గది వుంది. గదిలో దీపాలింకా వెలుగుతున్నాయి. గదిలోపల మాత్రం ఏవీగా అలికిడి లేదు. గది గుమ్మం దగ్గర నిలబడి, "బుగతా" అని నెమ్మదిగా కేకేశాడు. అలా కేకేశాక, తలుపు తీసుకొని లోపలికి చప్పుడు కాకుండా అడుగుపెట్టేడు.

గదిలో పాలవెన్నెల సురుగులా కాంతి పరుచుకుని వుంది. గోడలకి అందంగా అలంకరించుకునున్న ఆడవాళ్ల బొమ్మల కేలండర్లు వెలాడదీసివున్నాయి బయట అంత వాన కురుస్తున్నా లోన వెచ్చ వెచ్చగా వుంది. వెచ్చదనం వుండడమే కాకుండా మనిషిని మత్తెక్కించే సువాసన వుంది. వెచ్చగానూ, సువాసనగానూ వున్న ఆ గదికి ఓ మూల చక్కనైన చిన్న మంచం వుంది. ఆ మంచం మీదున్న పరుపు మీదున్న పువ్వుల పువ్వుల దుప్పటి ఎన్నెన్నో పడగలున్న పాము తలలా వుంది. దానిమీద మరం వేసుక్కూర్చున్న గవరయ్య బుగత పంచె, లాల్చీ కట్టుకున్న మీసాల దొంగ కృష్ణుడిలా వున్నాడు.

ఎత్తిన గాజు గ్లాసులోని ఎర్రని రమ్ము గడగడ ఒక్క గుక్కలో తాగేసి, గ్లాసునింకా పట్టుకునే, ఎర్రని జీరలున్న కళ్లతో ఎర్ర ఎర్రగా రాములివేపు చూసేడు బుగత.

"సాయిత్రిని రమ్మని కబురు సెప్పమంటే, సత్తిమంతుడి సెవంనాగ నువ్వొచ్చేవేట్రా సన్నాసెదవా ?" అన్నాడు బుగత బండబారిన సేదాలో మోటుగా.

చలి ప్రభావం ఇంకా వదలని రాములు వెంటనే సమాధానం చెప్పలేకపోయేడు

"సాయిత్రికేం వొచ్చిందిరా సన్నాసీ ?" అని చేతిలోని గ్లాసుని చప్పుడు చేస్తూ స్టూలుమీద పెట్టేడు. ఆ విసురుకి గ్లాసూ, దానితోపాటు సగం ఖాళీ అయిన రమ్ము సీసా రెండూ లిక్కు లిక్కుమని వూగేయి.

"త్రినాదు వూళ్లోనే వున్నాడంట బావు. ఆల్ల అత్తమ్మ కూడా తెలిగేసే వుందట ఇయ్యాల రానానికి ఈలవదని సెప్పమందాయమ్మ" అని వణుకుతూనే పారం అప్పచెప్పినట్టు చెప్పేశాడు రాములు.

"...ఏదో వొకటి... ఈలందరికీ ఏదో ఓటి ఒస్తాది...సమయానికి మాత్తరం వొచ్చి సావరు..." అని కోప్పడ్డాక, తలో పక్కకి వాల్చి ఆలోచనలో పడ్డాడు గవరయ్య బుగత.

అంతసేపూ క్షణం ఒక యుగంలా, బరువుగా నిలబడ్డాడు రాములు. బుగత మొహంవేపే ప్రాణాలుగ్గబట్టుకుని చూడసాగేడు ... అంతలో ఏం ఆలోచన వచ్చిందో తనలో తనే నవ్వుకుని తల ఆడించేడు బుగత.

ఆ నవ్వు మొహం చూసేసరికి రాములికి పోయిన ప్రాణం లేచి ఒచ్చినట్టయింది తన కోరికని బయట పెట్టడానికి ఇదే సమయం అనుకున్నాడు. నెమ్మదిగా దగ్గి ఒక అడుగు ముందుకి వేశాడు

"బావూ, కోక గురించి అడిగివాను..." అని మెల్లిగా నసిగేడు.

బుగత తల ఎత్తేడు. కుంటి కప్పని చూసిన ఆకలితో నున్న అల్లరి పెనుపాములా రాముల్ని చూశాడు.

"ఓరోరె... మర్సిపోనాన్రా... ఈ మద్దిన ఎదవది ఏటీ యాదస్తు వుండడం లేదు. అలగేలేరా. కొక్కేటి వున్నాం ? కావల్సినన్ని కోకలొస్తాయి... అద్సరే గానొరే రావులూ! నీ కూతుర్నోపాలి మా యింటికాడికి పమ్మించుమీ! బియ్యం బాగుసేవానికి ఎవుర్నేనా పిలవమంది మీ బుగతమ్మ. పని సేసి నట్టూ వుంటాది... కోక తీసుకోనానికి ఒచ్చినట్టూ వుంటాది... అవునుగాని, ఎలా వుంటాదిరా, నీ కూతురూ ? ఆఁ... మువ్వేటి సెప్తావుగాని – లేవ్వస్మించు. ఎలాగా గొప్పదిగదా వేస్కొస్తావ్లే! నువ్వు మరింక ఎల్లు. సీసా ఖాలీస్పమయింది యేల...!" అని 'ఏమంటావు ?' అన్నట్టు చూసేడు బుగత.

"అలాగేనావ్!" అన్నాడు రాములు తలొంచుకుని.

## 6

పలకని ఒళ్లో పెట్టుకుని దానిమీద బలపంతో ఏదో రాస్తున్న రజనిని ఆత్రంగా చూశాడు రవి. తను తీసుకున్న చొరవని రజని ఏ విధంగా అర్థం చేసుకుంటుందో అని తల్లడిల్లిపోయాడు.

"మావయ్యా, ఇంద." అంటూ పలకని రవికి అందిచ్చింది. కంగారుగా దాన్నందుకుని ఏం రాసిందో నని చూశాడు.

తను రాసిన 'నేను' కీ 'నిన్ను' కీ మధ్య ఇంటూ గుర్తు పెట్టి దానిమీద చిన్న అక్షరాలతో కుదురుగా గుండ్రంగా 'కూడా' అని రాసింది. పదాలన్నీ కూడ బలుక్కుని చదువుతూ, తాత్కాలికంగా ఏడేళ్ల కుర్రాడయ్యేడు రవి.

'నేను కూడా నిన్ను ప్రేమిస్తున్నాను' అని మనసులో చదువుకొని నవ్వుతూ రజని ముఖంలోకి చూశాడు. ఆమె అంతవరకూ బిగపట్టి ఆపిన సిగ్గు పాదరసంలా చరచర మొహంలోకి ప్రాకింది. ఆ సిగ్గంతా నవ్విన కళ్లలోనీ, వంపులు తిరిగిన పెదిమల్లోనీ, లొత్తపడ్డ బుగ్గలోనీ ఒక్కసారి ప్రతిఫలిం





విజయవాడలో సెప్టెంబరు 10 న జరిగిన కృతి సమర్పణ మహోత్సవంలో కవి సామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'శివార్పణం' కృతిని ధ్వన్యనుకరణ సామ్రాట్ శ్రీ నేరెళ్ల వేణుమాధవ్‌గారికి అంకితం చేశారు. ఈ సందర్భంలో శ్రీ వేణుమాధవ్ రు 1116 లతో కృతికర్తని సత్కరించారు. ఆ సందర్భంలో తీసిన ఛాయా చిత్రం.

## పుత్తడి బొమ్మ

చేయి. రివ్వున లేచి కర్టెన్ ఒత్తిగించి మెరుపులా మాయమైంది

తేలికపడ్డ మనస్సుతో వెనక్కి చేరబడ్డాడు రవి. తనని వేధిస్తున్న సమస్య ఇంత హాయిగా తేలిపోయినందుకు గుండెనిండా ఆనందం పురకలు వేసింది తన చుట్టూ వున్న లోకం అంతా మాయమైపోయినట్టూ, పువ్వులు నవ్వే పచ్చని మైదానంలో తనూ రజనీ గువ్వల్లా ఒదిగి కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నట్టూ అన్పించింది ఆ క్షణంలో

"రజనిని ఏమన్నా అన్నావేమిటిరా ?" అంటూ వచ్చి కూర్చుంది జానకి

"ఏమీ లేదే !"

"ఏమో మరి ! ఎర్రబడ్డ మొహంతో వంటింట్లో కూర్చుంది. 'నేను వంట చేస్తాన్లే నువ్వెళ్లు' అని నన్ను తరిమిందిక్కడికి .." అని ఆగిపోయింది

ఏం మాట్లాడాలో తోచక రవి మౌనంగా కూర్చుని వున్నాడు జానకి పనీ అలాగే వుంది. 'ఆనాటి చిన్నతనం మళ్లీ వచ్చేస్తే బాగుణ్ను ! హాయిగా ఎన్నెన్ని కబుర్లో చెప్పుకోవొచ్చు !!' అనిపించింది జానకికి.

"అక్కా, రజని కేమైనా పెళ్లి ప్రయత్నాలు చేస్తున్నారా ?"

"ఆఁ అన్నీ అయ్యేయి మీ బావ కాళ్లకి బలపాలు కట్టుకుని చెప్పులు అరిగేలా తిరగడం, ఎవరెవరి కాళ్లో పట్టుకుని పెళ్లిచూపులకి తీసుకు రావడం, వాళ్లు వచ్చి చూడ్డం, అన్నీ నచ్చేక అసలు సంగతి తెలుసుకుని వేరే సంబంధం చూసుకోమని ఓడి సలహా ఒకటి పారెయ్యడం... ఇవన్నీ చూసి చూసి విసుగెత్తిపోయేం... !"

"ఏం ఫర్వాలేదు అక్కా... రజనికేం ? బంగారం లాంటి పిల్ల. ఎవడేనా కళ్ల కద్దుకుని మరీ పెళ్లి చేసుకుంటాడు. నువ్వేం బాధపడకు" అన్నాడు రవి ఓదారుస్తున్నట్టు.

జానకి పెదిమలు విరిచి నిస్పృహతో నిట్టూర్చింది. 'నీకేం తెలుసు, ఈ లోకం సంగతి ?!' — అన్నట్టు విరాగిలా నవ్వింది.

తనన్న మాటలు అక్కకి ఎలాంటి ఓదార్పు కలిగించవని తెలుసు. ఆ పరిస్థితిలో ఆడపిల్లని కన్న తల్లిదండ్రులు ఎంత ఘోర నరకం అనుభవిస్తారో రవి వూహించగలడు.

"అలా అనుకునే ధీమాగా కూర్చున్నాం. ఈ కాలంలో కూడా ఇలాంటి చాదస్తం వున్నవాళ్లు వుంటారా అని నిర్లక్ష్యం చేశాం ఏమనుకుంటే ఏం లాభం ? నిక్షేపంలాంటి కుటుంబంలో పుట్టినా 'కులంతక్కువ పిల్ల' అయిపోయింది రజని. ఎలాంటి కులంలో పుట్టినవాడికైనా యిచ్చి పెళ్లి చెయ్యడానికి సిద్ధపడ్డారు మీ బావ ఏం లాభం ? చివరికి ఏం తోచక దాని పెళ్లికి కట్నంగా ఇద్దామని దాచిన డబ్బుతో దాన్ని మెడికల్ కాలేజీలో చేర్పించాం. ఆ డబ్బుతోనే మెడిసిన్ చదివిస్తున్నాం. అది తనకసలు పెళ్లే ఒద్దంది. అన్నీ ఇష్టపడి చేసుకున్న వాడొస్తేనే — పెళ్లి ... లేకపోతే ఇలాగే బ్రహ్మచారిణిగా వుండిపోతా నంటుందది !"

"ఆఁ .. ఈ కబుర్లకేంగానీ, పెళ్లి చేసుకోక ఏం చేస్తుంది ? ఆలస్యం అయితే ఏం ? తగిన వాడే వొస్తాడు..."

"నీ కడుపు చల్లగా — అంత మాటన్నావు... అలాగే జరుగుతుందిలే—" అంది జానకి కొంచెం

## ప్రశ్నావళి.

ఎస్. ఎమ్. ఆర్. చినకాంపల్లె (చిత్తూరు జిల్లా)

మహిళా మండలి స్థాపనకు ఎంత పెట్టుబడి వుండాలి ?

★ ముందు ఏమీ అక్కరలేదు సోదరీ, మీ అరుగుమీద మధ్యాహ్నం పూట కబుర్లాడడానికి చేరే అమ్మలక్కలే — మహిళా మండలి. కావలిస్తే గోడమీద ఓ పేరు రాయించు. ఏ సంక్షేమ శాఖవారికో, స్త్రీ సంక్షేమ శాఖవారికో ఓ కార్డు రాసి పడేస్తే చాలు — గ్రాంటు ! . దాంతో ప్రారంభం పోటీలు అప్పుడిక మహిళా మండలి స్థాపించినవారు కలికంలోకి కూడా కనిపించరు మీ వూరి పెద్దల భార్యలూ, మరదళ్లూ, ఒదినగార్లూ— ప్రెసిడెంటు, సెక్రటరీ, కోశాధికారి... అంటూ ముందుకొస్తారు !... ఉత్సవాలు జరిపిస్తారు. పెద్దలని పిలిపిస్తారు. ఫొటోలు తీయించుకుంటారు !

వి. వి. ఎస్. కావలి

ఒకడు తన స్నేహితుని మీద ఎక్కువ మమకారాన్ని ఆప్యాయంతో ప్రేమతో చూసుకుంటూ.

★ ఇంక చాలు స్నేహానికి పర్యాయ పదాలు కాదు — ఆప్యాయం ప్రేమ మమత ! యివన్నీ ప్రేమకి చిహ్నాలు ఒక స్నేహితుడితో,— ఉండవలసినది సగౌరవం అయిన స్నేహం ముందీ సంగతి గుర్తించి మసలుకోవడం నేర్చుకోండి.

టి. ఎస్. బి ఎమ్మిగనూరు

కొందరు తోటి వుద్యోగినుల మీద అదే పనిగా చెడునే స్పష్టిస్తూ వుంటారు. స్త్రీని స్త్రీగా చూసే కాలం ఎప్పుడండీ ?

★ స్త్రీని ముందు స్త్రీలే నీచంగా చూసే పరిస్థితి తొలగిననాడు !

ఎ వి ఆర్ మోతుగూడెం, లోయర్‌సీలేరు.

మీరు జవాబు లిచ్చుటలో చాలా తెలివికలవారే గాని కించిత్తు స్త్రీ పక్షపాతులు - అని నేను, కాదని మా శ్రీమతి...

★ నేను మటుకు మీ శ్రీమతిగారితోనే ఏకీభవిద్దును కాని... మళ్లీ మీ రా మాటే — అదే స్త్రీ పక్షపాతి అని. . అంటారని భయంగా వుంది !

కె వి. ఆర్. కాకినాడ

ఇంతకీ మీరు ఏం చదువుకున్నారు ?

★ 'చదివించిరి నను గురువులు చదివితి సకలార్థ' అంటూ రఫీమని చెప్పాలనే వుంది . కాని నాకు అక్షరాలు నేర్పాలని నానా కష్టాలూ పడ్డ కామశాస్త్రిగారు, బుర్రలో కాస్త శాస్త్రీయ విజ్ఞానం చొప్పించాలని నానా తాపత్రయం పడ్డ జగన్నాధం మేష్టారు, సంగీతం నేర్పాలని గొంతు పగలకొట్టుకున్న శాస్త్రిగారు, నాట్యం చెప్పి, ప్రాణం విసిగి ఒదిలేసిన గాడిచెర్ల మేష్టారు .. ఒకరేమిటి యింకా చాలా మంది సాకు ఉన్నారు. . అందుకని అంత అబద్ధం పబ్లిక్‌గా చెప్పడానికి జంకుతున్నాను - మా నాన్న రాక్షసుడు కాదు కనక సరిపోయింది లేకపోతే. . ఏ కొండమీద నుంచో తోయించను. నే కట్టుకున్నాయన మా వాన్న కంటె అన్యాయం 'నువ్వు చదువుకున్నా చదువుకోకపోయినా ఏం ఫరవాలేదు' అని ఆనందిస్తారు .. యింక నా పిల్లలంటారా ?... నా ఒక్కొక్క మాటకీ 'మై గాడ్. నీకు డిగ్రీ యిచ్చినందుకు మద్రాస్ యూనివర్శిటీ వారి ననాలి' అని నొచ్చుకుంటూ వుంటారు.. ఇటువంటి యిబ్బందికర పరిస్థితు

తృప్తిపడి.

''చూస్తూండు. జరిగి తీరుతుంది!'' అన్నాడు రవి కనుబొమలు ఎగరేస్తూ.

''ఇన్నేళ్ల తర్వాత ఇప్పుడు ఆలోచించి చూస్తే -- నేను చేసింది తప్పేమోననిపిస్తూంది రవీ! మీ బావగారి కులం గురించీ, మేం పెళ్లి చేసుకుంటే వచ్చే ఫలితాల గురించీ నేను ఆలోచించక పోలేదు. కాని, అంతగా పట్టించుకోలేదు? ఆయనకూడా అంతే ... మేమిద్దరం ముందు ముందు ఇలాంటి అవాంతరాలొస్తాయని అనుకోక పోలేదు. మగ సంతానమే కలగాలని ఎంతో కోరుకున్నాను ఏం లాభం? పుట్టిన ఒక్క నలుసూ ఆడపిల్లయిపోయింది ... ఆనాడు — అమ్మ నామీద మండిపడ్డనాడు నేను ఏ నూతిలోనో పడి చావవలసింది. కాని అందుకు ధైర్యం చాలలేదు నాకు. నా తొందరపాటు నన్నెన్ని రకాలుగానో హింసించింది. ఇప్పటికీ చిత్రవధ చేస్తున్నాది. ఈ ఇల్లే నా లోకం. ఎక్కడికి వెళ్లినా వికవికలు. పకపకలు కన్న తల్లికి కూడా నేను అక్కర్లేకపోయేను. తల్లికీ నేను పరమ శత్రువైపోయేను...'' — అని ముక్కు ఎగపీలుస్తూ పైటచెంగుతో కళ్లు తుడుచుకుంది జానకి. ఆమెకి ఏమని చెప్పి ఓదార్పు కలగజెయ్యాలో రవికి బోధ పడలేదు. ఏళ్ల తరబడి ఆవేదనతో క్రుంగిపోతున్న ఆ నిట్టూర్పుల కుంపటిని ఎవరు మాత్రం ఎలా అనునయించగలరు?

''రజని చిన్నతనంలో నువ్వు దొంగతనంగా మా ఇంటికి వచ్చేవాడివి. నేను ఎంత పొంగిపోయేదాన్నో! నువ్వు అమ్మనీ నన్నేనా కలుపుతావని ఎన్నో ఆశలు పెట్టుకునేదాన్ని...''

''అమ్మ సంగతి తలుచుకుంటే నాకు ఎంతో విచిత్రంగా వుంటుంది అక్కా... మిగతా అన్ని విషయాల్లోనీ ఎంతో ప్రేమగా, ఉదారంగా వుంటుంది. నీ విషయంలో మాత్రం అమ్మ గుండె పాషాణం అయిపోతుంది!'' అన్నాడు రవి.

''అందుకు కారణం లేకపోలేదులేరా, అమ్మ చిన్నప్పటి నుంచీ కష్టాల్లోనే పుట్టి కష్టాల్లోనే పెరిగింది... నువ్వు పుట్టేక సుఖం అంటే ఏమిటో కొంచెం తెలిసింది దానికి. ఈలోగా నాన్న పోయేడు అమ్మ ఒంటరిదైపోయింది. అప్పటికి మనం చాలా చిన్నవాళ్లం. నువ్వూ నేనే అమ్మకి మిగిలేం. మనిద్దర్నీ తన ఇష్టానికి అనుగుణంగా పెంచాలనుకుంది. పెంచింది కూడాను. అమ్మ దృష్టిలో 'తక్కువ కులం' మనిషిని నేను పెళ్లి చేసుకోవడం — ఓ రకంగా అమ్మని కనిపించని దెబ్బతీసింది...'' అంటున్నజానకిమాటలకి మధ్యలో అడ్డువచ్చాడురవి.

''అవునుగానీ, అక్కా! అమ్మ మనస్సు మరి మారదంటావా?''

కాస్సేపు ఆలోచించింది జానకి.

''ఉహూఁ. అమ్మ మనస్సు మారడం... సూర్యుడు పడమరన వుదయించడం ఒకేసారి జరుగుతాయి.'' అంది.

''ఏమో ... నాకు మాత్రం — ఎప్పటికైనా అమ్మ మారవచ్చు అనే ఆశ వుంది.'' అన్నాడు రవి ఆలోచనాపూర్వకంగా.

''అదంతా మీ పిచ్చిరా!''

''ఏమో ... నీ నమ్మకం నేను కాదనలేను గానీ ... నేనలా అనడానికి కారణం లేకపోలేదు ... ఓసారి మా ఫ్రెండ్ రమ్మంటే నేను మద్రాస్ వెళ్లేను. వాడక్కడ ఓ హోటల్లో వుంటున్నాడప్పటికి. ఏదో సినిమా కంపెనీలో అసోసియేట్ డైరెక్టర్గా పని చేస్తున్నాడు. వాడితోపాటు నేనూ ఆ హోటల్లో వున్నాను. ఒకరోజు అర్ధరాత్రప్పుడు కేకలూ గోలా వినిపించేసరికి యిద్దరం లేచి మేడ కిందికి దిగేం ... హోటలు మేనేజరు గదిలో ఎర్రచీర కట్టుకున్న ఓ ఆడపిల్ల నిలబడి వుంది. తెలుగమ్మాయి. ఆ పిల్ల మొహం నాకిప్పటికీ జ్ఞాపకం వుంది...భయంలో ఒకటేవణకడం... గోడు గోడున ఏడుస్తూ తన గోలంతా చెప్పుకొంది. ఆ హోటల్ మేనేజరూ, మేమూ తప్ప అక్కడ తెలుగువాళ్లెవరూ లేరు. అక్కడ చేరిన గుంపులో వున్న వాళ్లందరూ అరవ్వాళ్లూ ... బెంగాలీలే! ఆ పిల్ల తల్లిదండ్రులకి చెప్పకుండా ఇంట్లోంచి పారిపోయి వచ్చిందిట నమ్మినవాడు, డబ్బయిపోయేక, వదిలేసి పత్తాలేకుండా పోయేట్ట. దాంతో గత్యంతరంలేక చెడుతోవలు తొక్కడం ప్రారంభించింది ... ఆరోజు సాయంకాలం ఎవరో ముగ్గురు అరవ్వాళ్లు ఆ అమ్మాయిని అక్కడికి తీసుకొచ్చేరట. పీకలమొయ్యా తాగి నానా అల్లరీ చేసేరట ... వాళ్ల భాష ఈ అమ్మాయికి రాదు. దాని తెలుగు వీళ్లకి బోధపడదు. ఆ అమ్మాయిని కూడా తాగమని బలవంతం చేసేరట ... తాగకపోతే కొట్టడం ప్రారంభించేరుట ... ఆ దెబ్బల బాధ భరించలేక అరిచి గోలచేసి గదిలోంచి బైట పడింది .. ఆ ముగ్గురు వెధవలూ ఈలోగా చల్లగా జారుకున్నారు...'' అంటూ ఆగి అలవాటు ప్రకారం అన్యమనస్కంగా జేబులోంచి సిగరెట్ తీసి పెదిమల మధ్య పెట్టి వెలిగించేడు. గుప్పున పొగ వదుల్తూ అక్క మొహంలోకి చూశాడు రవి.

మొట్టమొదటిసారిగా తన ముందు సిగరెట్ కాలుస్తూన్న తమ్ముణ్ణి చూస్తూ నిర్ఘాంత పోయింది జానకి.

అది గమనించిన రవి 'సారీ' అంటూ సిగరెట్ ఆర్పబోయేడు.

''ఏం...ఏం...తాగురా. ఫర్వాలేదులే. నువ్విప్పుడు పెద్దవాడివయ్యేవు. కాబోయే లాయరువి ఫర్వాలేదు తాగు'' అని జానకి అన్నప్పటికీ, ఆమె ముందు సిగరెట్ తాగడానికి మనస్కరించక సిగరెట్ని దూరంగా విసిరేశాడు రవి.

''అయ్యో. అదేం పనిరా...సరే నీ యిష్టం'' జానకి సిగ్గుతో బాధపడున్న రవిని చూచి ... ''ఇంతకీ ఆ అమ్మాయి సంగతేమైంది?'' అంది.

[ఇంకా వుంది]

— కె. రామలక్ష్మి

లలో... నేనేం చదువుకోలేదు సార్ అనడం ఉత్తమం కదా రావుగారూ?!

ఎమ్. కె. ఆర్. విజయనగరం

జీవితంలో కొన్ని ఆశయాలు సాధించాలని వూహించాను...

★ ఊహ చాలదు. దానికి తోడుగా కృషి — ఆ కృషికి జతగా ఓర్పు, ఉండాలి. అపజయాలని చిరునవ్వుతో దిగమింగుకుని, తిరిగి ప్రయత్నం చేసే పట్టుదల వుండాలి. అప్పుడే ఆశయాలు — సిద్ధించే ఛాన్సు వుంటుంది. అప్పుడు కూడా — నెరవేరి తీరుతాయన్న గ్యారంటీ వుండదు.

పి. పి. ఎస్. గుడివాడ

మీ జవాబులు వింటూంటే ఒక్కసారిగా స్త్రీ జాతిని ఉద్ధరించుదామని కోరిక కలుగుతోంది... మీ సలహా?

★ కోరికలకేం — యీ దేశంలో కారుచౌక! కావలసినంత కోరుకో బ్రదర్, తాటేకు మంటల్లాంటి మీ సముద్ధరణ కోరికలు — ఎంతట్లో చల్లారిపోతాయో యిప్పుడిప్పుడే గ్రహిస్తున్న స్త్రీ జాతి — తమని తామే సముద్ధరించుకోవాలన్న సత్యం కూడా గ్రహిస్తూంది.

జగదీశ్, కర్నూలు

నేటి పలుచోట్ల తిరుగుతున్న నగ్న సంచారంపై మీ అభిప్రాయం?

★ ఏ రాయితో తైతేనేం పళ్లూడ గొట్టుకోవడం?! ఏ పద్ధతిన అయితేనేం — అసమ్మతి తెలియచేయడం?!

వి. కె. వి. ఆర్. హైదరాబాదు

మీ రస్తమానూ మంచి నడవడి కావాలంటూ వుంటారు అదెలా వస్తుంది?

★ మంచి నడవడి చిన్న చిన్న త్యాగాలవల్ల ఏర్పడుతుంది. ఎవరూ — ఏ బడిలోనూ చెప్పించరు.





''కథానాయకుని కథ''లో రామారావు, వాణిశ్రీ

## అప్పలనరిసిగా విజయలలిత

టి. వి. యస్. ఇంటర్ నేషనల్‌వారి ''రాజ్యంలో రాబందులు'' చిత్రంలో అప్పలనరిసి అనే పాత్ర ఒకటుంది. అప్పలనరిసి సహజమైన సౌందర్యవతి. గుణవతి. తెలివిగలది. అన్నీ ఇచ్చిన భగవంతుడు ఆమెకు ముద్దుగా మాటాడగలిగే నోరు నివ్వలేదు. మూగదే అయినా, సమయస్ఫూర్తి గలది. ఒక క్లబ్‌లో పనికత్తెగానూ, శేఖర్ అనే వ్యక్తికి ఇంటి పనుల్లో సాయపడుతూ అతనికి తోడుగానూ వుంటూ జీవితాన్ని సాగిస్తూంటుంది.

అప్పలనరిసి ముగ్ధతనం, మూగదనం శేఖర్‌ను బాగా ఆకట్టుకున్నాయి. ఒకరికి తెలియకుండా ఒకరు ప్రేమించుకుంటారు. చివరకు పరిణయ మాడుతారా లేదా అనే ప్రశ్నకు ''రాజ్యంలో రాబందులు'' సమాధాన మిస్తుంది. అప్పల నరిసిపాత్ర చిత్రానికి జీవనాడి లాంటిది. ప్రతి పాత్ర ఈ పాత్ర చుట్టూ తిరుగుతుంది. అప్పలనరిసిగా విజయలలిత నటించింది. శేఖర్‌గా రామకృష్ణ నటించాడు. వీరిద్దరి ధ్యేయం ఒక్కటే. పైకి మంచివారుగా నటిస్తూ, పీకలు కోసే గోముఖ వ్యాఘ్రాలను పట్టి, వారి దురాగతాలకు స్వస్తి చెప్పించాలనేదే శేఖర్, నరిసిల ఆశ. ఆ ఆశ నెరవేరిందో లేదో ''రాజ్యంలో రాబందులు'' ఋజువు చేస్తుంది.

కేతల త్రినాధరావు నిర్మించిన ఈ చిత్రానికి కె. యస్. ప్రసాద్ దర్శకుడు. దాసం గోపాలకృష్ణ మాటల రచయిత. కె. వి. చలం, చంద్రమోహన్, కొమ్మినేని, సి. హెచ్. మోహన్‌బాబు, ముఖ్య పాత్రధారులు.



''రాజ్యంలో రాబందులు''లో రాజేశ్వరి

## ''చుక్కాని'' లో రంగనాధ్ !

సముద్రంలో ఎన్నో కోట్ల నౌకలు ప్రయాణం చేస్తుంటాయి. అలాగే సంసారమనే సాగరంలో ఎన్నో కుటుంబాలు సాగిపోతుంటాయి. నౌక సక్రమంగా పయనం సాగించాలంటే చుక్కాని అవసరం ఎలా ముఖ్యమో సంసార నౌక ఒడుదుడుకులు లేకుండా సాఫీగా నడవాలంటే చుక్కాని వంటి మనిషి ఎంతో ముఖ్యం. నమ్ముకున్న ఆదర్శాలను ఆఖరి వరకు ఆత్మధైర్యం, స్థైర్యాలతో పాటించి, ఎన్నో ఇడుములను భరించిన ఒక అమృతమూర్తి అపూర్వగాధే పాంచజన్య ప్రొడక్షన్స్ వారి ''చుక్కాని'' చిత్రం. ఇందులో రంగనాథ్ రంగు పూయనున్నట్లు అతడి ద్వారా తెలిసింది.

నవంబరు నుండి నిర్మాణ కార్యక్రమం ఆరంభం కానున్న ''చుక్కాని'' చిత్రానికి నిర్మాతగా టి. అప్పలదాసు, సారధిగా రావుల తాతారావు అభ్యుదయపథంలో చిత్ర నిర్మాణానికి పూనుకున్నారు. ఈ చిత్రానికి పి. డి. ప్రసాద్ దర్శకత్వాన్ని, సత్యం సంగీతాన్ని, ఎన్. ఆర్. నంది సంభాషణలను, సుఖదేవ్ ఛాయను సమకూరుస్తున్నారు. ఇందులో కొందరు క్రొత్తవాళ్ళు, కొందరు పాతవాళ్ళు విభిన్న పాత్రల్లో కన్పిస్తారు.

## అమృతాకు దర్శకుని మార్పు

''చెల్లెలి కాపురం'', ''నేరము—శిక్ష'' లాంటి ప్రయోజనాత్మకమైన చిత్రాలను నిర్మించిన అమృతా ఫిలింస్ ఇప్పుడొక క్రొత్త చిత్రాన్ని ప్రారంభించి, సెప్టెంబరు 2 నుండి షూటింగ్‌ను కొనసాగించింది. చిత్ర కథకుడు, సమర్పకుడు బాలయ్యే. కానీ దర్శకుడు విశ్వనాథ్ కాదు, డి. యస్. ప్రకాశరావు (మరపురాని తల్లి) స్వరానికి రాజేశ్వరరావు, మాటల రచనకు సముద్రాల జూనియర్, కూర్పుకు వీరప్ప, కెమెరాకు బి. రామచంద్రయ్య పని చేస్తున్నారు.

బాలయ్య, చంద్రమోహన్, రావు గోపాలరావు, మిక్కిలినేని, రావి కొండలరావు, సాక్షి రంగారావు, మోదుకూరి సత్యం, రవికుమార్, ప్రభ, రోజారమణి, పండరీబాయి మరియు నూతన నటుడు సత్యేంద్రకుమార్ నటిస్తున్న ఈ చిత్రానికి ఏ. సూర్యనారాయణ, ఎం. వెంకట్రావు నిర్మాతలు. శ్రీ ఫిలింస్ విడుదల.

## నల్లమ్మాయి జీవితంలో వెలుగు !

ఎడారిలో మంచినీళ్ళు దొరకడం సాధ్యమా ? అదృష్టవశాత్తు దొరికితే, పయనించే బాటసారికి ఎంత హాయిని కలిగిస్తుంది. పులిమీద స్వారీ చెయ్యగల ధైర్యం ఎవరికయినా వుంటుందా ? అలా చెయ్యగలిగిన వ్యక్తిని చూస్తే చూపరులకు ఎంత ఆశ్చర్యం అనిపిస్తుంది.

అలాగే ... నలుపు వన్నెతో పుట్టడం ఒక పాపంగా యితరులచే, అయినవాళ్ళచే అనిపించుకునే అమ్మాయికి ''నేను వున్నాను. నువ్వు నిశ్చింతంగా జీవితం సాగించు. నీ బ్రతుకులో వసంతాలు కురిపిస్తాను'' అని ఒక పురుషుడు హామీ ఇచ్చినప్పుడు, ఆమె మనోగత భావాలు ఎలా పరుగులు తీస్తాయన్న దానికి నిదర్శనంగా డాక్టర్. నారాయణరెడ్డి రాసి, సుశీల పాడి, చక్రవర్తి స్వరం కూర్చిన పాటను నా కలం ద్వారా పలికిస్తాను.

''అందని ఆకాశం అందుకున్నానులే
పొందని అనురాగం పొందగలిగానులే
ఇది తొలి పొద్దులే నా అందానికి
ఇక తుది లేదులే నా ఆనందానికి'' అంటూ

నల్లమ్మాయి ఆనందానుభూతిని నటి శారద ఎంత

''మంచి మనుషులు''లో





సహజంగా ప్రదర్శించిందో చూడాలంటే అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైసెస్ వారి "ఊర్వశి" వర్ణ చిత్రం చూడాల్సిందే. పి. రాఘవరావు నిర్మించిన ఈ చిత్రానికి బాపయ్య దర్శకుడు.

## శివలింగం ముందు జమున!

సెప్టెంబరు ఆరవతేదీ వాహినీ స్టూడియోలోని ఒక ఫ్లోర్‌లో చక్కగా తయారు చేయబడ్డ శివాలయం ముందు ఒకటే జన సందోహం, జనం మధ్యలో జమున కెమెరా ముందు నిలబడి వుంది. కారణం ఏమిటని తెల్సుకుంటే, నటుడు జయకృష్ణ జి. కె. ప్రొడక్షన్స్ పేరిట కలర్‌లో నిర్మిస్తున్న "బాలనాగమ్మ" చిత్రం ప్రారంభోత్సవమట ఆరోజు. బాలనాగమ్మగా నటించే జమున కెమెరా స్విచ్ ఆన్‌తో, కె. నందగోపాల్ తొలి క్లాప్‌తో శివుడిపై మొదటి షాటును చిత్రీకరించారు దర్శకుడు పి. యస్. రావు.

"శ్రీకంఠ లోకేశ లోకోద్భవస్థాన సంహారకారీ మురారీ" అనే శ్లోకం భూలక్ష్మిగా (బాలనాగమ్మ

"కొత్త కాపురం"లో





"చల్లని తల్లి"లో కాంతారావు, జయంతి

తల్లి) నటిస్తున్న పండరీబాయిపై చిత్రీకరించబడింది. సత్యనారాయణ (మాయలఫకీరు), రామకృష్ణ, ప్రమీల, రాజసులోచన, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, జ్యోతిలక్ష్మి, పద్మనాభం, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, ముక్కామల, రమాప్రభ, మాష్టర్ రాము ప్రధాన తారాగణమైన ఈ చిత్రానికి విద్వాన్ కణ్వశ్రీ రచన్ను, సుసర్ల దక్షిణామూర్తి స్వరాన్ని, వీరప్ప కూర్పును, వాలి కళను, పి. యస్. ప్రకాష్ ఛాయను నిర్వహిస్తున్నారు.

## "ఇల్లు - వాకిలి" లో వెరైటీ నాగభూషణం

డి. లక్ష్మీకాంతరావు, ఎమ్. సత్యనారాయణ రెడ్డి కల్సి స్థాపించిన సంస్థయే మేఘాలయ మూవీస్. ఆ సంస్థ నిర్మించే చిత్రం పేరే "ఇల్లు—వాకిలి." ప్రఖ్యాత దైవజ్ఞులు "అదృష్టం" జ్యోతిష మాస పత్రిక సంపాదకులు అయిన వి. బి. యస్. శర్మగారు క్లాప్ కొట్టగా, చిరంజీవి పి. మృత్యుంజయ వరప్రసాద్ కెమెరా స్విచ్ ఆన్ చేయగా తొలి షాటును ఏడుకొండలవానిపై చిత్రీకరించారు దర్శకుడు పి. డి. ప్రసాద్ ఆగష్టు ఇరవై మూడున.

"ఆడపిల్లల తండ్రి" చిత్రంలో క్రొత్తరకం నాగభూషణం కన్పించాడు. మళ్ళీ "ఇల్లు — వాకిలి" లో వెరైటీ నాగభూషణం కన్పిస్తారు. చేపట్టిన పాత్రను చేటుకు గురికాకుండా చెయ్యగల సామర్థ్యం భూషణానికి వుందని ఎన్నో చిత్రాలు ఇదివరకే చెప్పాయి. "ఇల్లు—వాకిలి" చిత్రంలోని పాత్ర ఆ నిజం విడివిని ఇంకాస్త పొడిగిస్తుంది.

## ఎల్లోరా గీతం

ఒక వార పత్రికలో సారస్వత కార్యక్రమాలను గూర్చి వ్రాసే ఎల్లోరా "ఇల్లు—వాకిలి" [illegible] నటి సత్యప్రియ, నటుడు [illegible]ంద్రమోహన్ లక్[illegible]ం ఈ పాటను వ్రాశారు. "తధిగిణతోం మాస్టారూ— కథ అడ్డం తిరిగిందా, ధిమికతకతై మాస్టారూ — గరిటె చేతికొచ్చిందా" అంటూ చంద్రమోహన్ను ఏడిపిస్తుంది సత్యప్రియ. ఎన్. ఆర్. నంది రచన్ను, సుఖదేవ్ ఛాయను, బి. శంకర్ సంగీతాన్ని, అంకిరెడ్డి కూర్పును, కృష్ణమూర్తి కళను సమకూరుస్తున్న ఈ చిత్రంలో కాంతారావు, గిరిబాబు, రావికొండలరావు, సారధి, కె. వి. చలం, బాలకృష్ణ, మాడా, సీతారాం, పొట్టిప్రసాద్, మోదుకూరి సత్యం, కె. కె. శర్మ, కోళ్ళ సత్యం, చిట్టిబాబు, రాజసులోచన, కె. విజయ ముఖ్య పాత్ర ధారులు. పాంచజన్య ప్రొడక్షన్స్ రథ సారధి రావు లతా తాగెన్నుగా కన్పించే అన్నపూర్ణా రావు ఈ చిత్రం విడుదల.



"ఇల్లు—వాకిలి"లో [illegible]భూషణం

# సినిమా



"ఆడదాని అదృష్టం"లో మమత, సుమ

## చక్రవాకంలో పాటలు

సురేష్ మూవీస్ వారి వర్ణ చిత్రం "చక్రవాకం" లోని అన్ని పాటలను ఆచార్య ఆత్రేయ వ్రాశారు. మార్కెట్టులో ఎన్ని పాటలు శ్రోతలను ఆకట్టుకున్నాయో తెలుసుకొన్నాను. నాలుగు జనాన్ని విపరీతంగా ఆకర్షించాయి.

1. 'వీణలోన తీగలోన ఎక్కడున్నది నాదము అది ఎలాగైనది రాగము' సుశీల పాడిన పాట.

2. 'కొత్తగా పెళ్ళయిన కుర్రాడికి పట్టరాని తొందర' రామకృష్ణ, సుశీల పాడిన యుగళగీతం.

3. 'ప్రియతమా, నా ప్రియతమా, ఎక్కడున్న ఎలాగున్న వినుము నా నివేదన.' సుశీల అద్భుతంగా పాడిన పాట.

4. 'ఈ నదిలా నా హృదయం పరుగులు తీస్తుంది.' రామకృష్ణ పాడిన పాట.

"చక్రవాకం" చిత్రానికి మహదేవన్ పెద్ద యస్సెట్ అనే చెప్పాలి. నిర్మాత రామానాయుడు మళ్లీ జాక్‌పాట్ కొట్టడం తథ్యము అనిపిస్తుంది. పిరమాచనేని మధుసూదనరావుకు "విక్టరీ" పర్యాయపదమై పోయింది. మాటలు రాయడంలో ఆత్రేయ అసాధ్యుడు అని మరొకమారు ఈ చిత్రం ఋజువు చేస్తుంది.

## చలం చిత్రానికి భమిడిపాటి

శ్రీ రమణ చిత్ర స్థాపించిన లగాయితు మొన్నటి "తులాభారం" చిత్రం వరకు రాజశ్రీ పర్మనెంట్ రచయితగా వుండేవారు. ఇప్పుడు ఆసంస్థలో భమిడిపాటి కథకుడి స్థానాన్ని ఆక్రమించారు.

హైదరాబాద్ సారథీ స్టుడియోలో వచ్చే నెల నుండి షూటింగు ప్రారంభమయ్యే యీ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు. చలం నాయకుడు. షూటింగు పక్షం రోజులు యిన్‌డోర్‌లో జరుగుతుంది. తతిమ్మాదంతా అవుట్‌డోర్‌లో జరుగుతుంది.

ఒక గమ్మత్తయిన పాత్రలో చలం కనిపిస్తారు. కొత్త నటీనటులు సహాయ పాత్రలను పోషిస్తారట.



## కృష్ణ క్లాప్

జనతా ఆర్ట్ థియేటర్స్ నిర్మిస్తున్న "రారాజు క్రీస్తు" అనే తెలుగు కలర్ చిత్రం షూటింగు సెప్టెంబరు 2న ఏ వి యం స్టుడియోలో ప్రారంభమైంది

హీరో కృష్ణ క్లాప్ కొట్టగా, యం యం బాలజియర్ కెమెరా స్విచ్ ఆన్ చేసిన ఈ చిత్రానికి జి. యస్ కృష్ణమూర్తి దర్శకత్వాన్ని, మాట పాటలను దేవులపల్లి, బి. గోపాలం సంగీతాన్ని, దిలీప్‌సింగ్ కళను నిర్వహిస్తున్నారు.

ఏసుక్రీస్తు మహిమలను సోదాహరణంగా నిరూపించే ఈ చిత్రంలో జగ్గయ్య, విజయ్, నారనాథ్, సాక్షి రంగారావు, రాజనాల, ముక్కామల, బి యల్ ఎన్. ఆచార్య, రాజశ్రీ, రాణి, రత్న, పి యల్ నారాయణ, కె. యల్. రాజా, మోహన్‌బాబు ముఖ్య పాత్రధారులు.

## అప్పారావుకు మొదటి చిత్రం

"నిండు కుటుంబం" లాంటి ఎన్నో ఉత్తమ చిత్రాలకు (బ్లాక్ అండ్ వైట్) కెమెరాను రన్ చేసిన హెచ్. అప్పారావుకు "రారాజు క్రీస్తు", కలర్ చిత్రానికి ఛాయను చేకూర్చే అవకాశాన్ని ప్రప్రథమంగా కల్గించింది. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగ పరచుకోగల పనితనం వుంది. రాణిస్తాడని ఆశిద్దాం

## తాళి భాగ్యం

స్త్రీ, పురుషులు ఎంత గాఢంగా ప్రేమించుకున్నా, మనసులను ఎంత బాగా అర్థం చేసుకున్నా, ఆడదానికి ఆ మూడుముళ్ళు పడేవరకు ఏదో ఆత్రుత, ఆరాటం వుండడం సహజం ఆ ఆరాటాన్ని అప్పటికప్పుడు మాటల పు రడింపుతో సర్దుబాటు చేయడం మగవానికి అలవాటు ప్రసన్నలక్ష్మి పిక్చర్స్ వారి "కొత్తకాపురం" చిత్రంలో కృష్ణ, భారతి ప్రేమించుకున్నారు. భారతికేమో తాళి భాగ్యం ఎప్పుడు కల్గుతుందనే ఆత్రుత కృష్ణకేమో పరిస్థితులు చక్కబడనీ, ఆపై మూడు ముళ్ళు వెయ్యాలనే ఆలోచన. "ముంతంత కొప్పులో — మూడు సేమంతిపూలు, ఏరోజు పెడతావు బావా— తాళి ఏరోజు కడతావు బావా" అని భారతి అడిగిన ప్రశ్నకు "మూడు ముళ్లేస్తాను — ముక్కుతాడేస్తాను, ఆ గడి యొస్తాదె పిల్లా – అంత తొందరెందుకే మరదలుపిల్లా" అని సమాధాన మిస్తాడు కృష్ణ. దాశరథి వ్రాసిన పై పాటను మహదేవన్ సంగీతంలో సుశీల, బాలసుబ్రమణ్యం పాడారు.

పాలేరుగా చేరిన ఒక సాధారణ వ్యక్తికి, పొలం, స్థిరాస్తి వున్న ఒక అమ్మాయికి జరిగిన పెండ్లి సారాంశమే "క్రొత్త కాపురం". పి. సి. రెడ్డి దర్శకత్వంలో జి. వెంకటరత్నం నిర్మించిన ఈ చిత్రంలో గుమ్మడి, చంద్రమోహన్, అల్లురామలింగయ్య, పద్మనాభం, రాజనాల, భారతి, రమాప్రభ, సూర్యకాంతం, అనిత, హేమలత, బేబి శ్రీదేవి ముఖ్య పాత్రధారులు పూర్తై విడుదలచేసే ఈ చిత్రానికి బొల్లిముంత మాటలను, లక్ష్మణ గోరే ఛాయను, చలం కళను, మహేశ్వరరావు కూర్పును సమకూరుస్తున్నారు

## ప్రత్యేక సమాచారం

"నటరత్న" రామారావు నటించబోయే వర్ణ చిత్రం ధనాన్ని పేరుతో గొన్న పంపిణీ సంస్థ తీసుకునే శుభ దినం ఆసన్నమైనట్టు వార్త

పేరులో లక్ష్మి + వెలుగును పెట్టుకొన్న హాస్య నటి, తమిళంలో విజయఢంకా మ్రోగించిన ఒక నవ్వుల చిత్రాన్ని తెలుగులో నిర్మించడానికి నిర్ణయించినట్టు వార్త. పాము చిత్రంలో దుష్ట పాత్రను పోషించిన, ఒకానొక చిత్రంలో హీరో వేషం ధరించిన వెన్నెలబాబు, హాస్య నటి తీయనున్న చిత్రంలో కథానాయకుని పాత్రను పోషిస్తారట

ఆంధ్రుల అగ్రనటుడు వచ్చే ఏడు పది చిత్రాలలో నటించడానికిసమ్మతించినట్టు వార్త

—శ్రీనివాస్

## రామకృష్ణ ఎంత బాగా పాడాడు?

గత వారం రవిశంకర్ ఆర్ట్స్ పిక్చర్స్ వారి "బలిపీఠం" తాలూకు కవి దాశరథి రాసిన మనోహరమైన పాటను జెమిని థియేటర్లో చక్రవర్తి రికార్డింగ్ చేశారు

"చందమామ రావే జాబిల్లి రావే
అమ్మాయి అలిగింది అలక తీర్చి పోవే"

అన్నది పల్లవి ఈ పాటను రామకృష్ణ, సుశీల పాడారు సుశీల గాన మాధుర్యాన్ని గూర్చి చెప్పాలా? రామకృష్ణ ఎంత బాగా పాడాడంటే, నా మటుకు నేను పదిసార్లు విన్నాను హీరో శోభన్‌బాబుకు రామకృష్ణ వాయిస్ నూరు శాతం సరిపోతుంది అన్నది నిజమే అనిపించింది ఇంతవరకు రామకృష్ణ పాడిన పాటలన్నిటిలోకి, యీ పాట గొప్పది అని చెప్పే ధైర్యం నాకు ఏర్పడింది

పై పాటను శోభన్‌బాబు, శారదలపై చిత్రీకరిస్తారు "బలిపీఠం" చిత్రాన్ని హిట్ చెయ్యడానికి,

"ఎవరికి వారే యమునా తీరే"లో సత్యనారాయణ



దర్శకుడు దాసరి దీక్ష బూనారు. ఈ చిత్రానికి వై. సునీల్ చవుదరి నిర్మాత.

### దాసరి చెయ్యనున్న చిత్రాలు !

ప్రజలచేత కీర్తింపబడుతున్న కొద్దిమందిలో దాసరి నారాయణరావు ఒకరు. ఆరుమాసాల క్రితం ఆయన ఒక పథకాన్ని ప్రకటించారు. మూడు చిత్రాలకు మించి చెయ్యబోనని అందులో వివరించారు. అదే ప్రకారంగా పథకాన్ని ఆచరణలో పెట్టబోతున్నట్టు చెప్పారు. అందుకే, వస్తున్న అవకాశాలకు ఆశపడడం మానేశారు. ఇప్పుడాయన చెయ్యనున్న చిత్రాలు మూడు మాత్రమే నని పేర్కొన్నారు. అవేమిటన_

"విశ్వభారతి ప్రొడక్షన్స్, ఆదిత్య చిత్ర, విజయ వేలాంగణి పిక్చర్స్." ఈ మూడింటికి షూటింగులు పూర్తి అయిన తరువాతగాని కొత్త చిత్రాల షూటింగు ప్రారంభం కాదని నారాయణ రావు అన్నారు.

ఈయనకు నటసామ్రాట్ నాగేశ్వరరావు నటించే చిత్రాన్ని డైరెక్ట్ చెయ్యాలని వుంది. 'తాత – మనవడు' శతదినోత్సవ సభలో ఆయన ఈయన దగ్గర పని చెయ్యాలన్న అభిప్రాయాన్ని వెల్లడించియున్నారు. శుభమగుగాక !

### విశ్వనాథ్ విశిష్టత !

"ఓ సీత కథ" తరువాత కాశీనాథుని విశ్వనాథ్ దర్శకత్వం వహించిన "అమ్మ మనసు" చిత్రం త్వరలో విడుదల కాబోతుంది. ఆ చిత్రం మొదటి కాపీని సుభాషిణీ థియేటర్లో వెయ్యడం జరిగింది.



"దీక్ష"లో ఒక దృశ్యం

ముఖ్యమైన వ్యక్తులు కొందరు వీక్షించారు. చిత్రాన్ని చూచిన ప్రతి వొక్కరు విశ్వనాథ్‌గారి విశిష్టతను పేర్కొన్నారు.

అమ్మలాంటి మనసు జగతిలో మరొకరికి వుండదని, కన్న కడుపు ఎలాంటి త్యాగానికయినా వెనకాడదని చెప్పిన కథ "అమ్మ మనసు". తన బాధను మనసులో యిముడ్చుకుని, తన గాథను రహస్యంగా దాచుకుని, యితరుల మనసుకు ఆనందాన్ని కలిగించే డాక్టర్ మాధవిగా జయంతి ఎంత సహజంగా నటించిందో, నవ్వుతూ, పిల్లల్ని నవ్విస్తూ, రేసు పిచ్చి గొన్న రాజుగా చలం అంత చక్కగా నటించారు. అనాథ శరణాలయంలో పని మనిషిగా నటించిన కె. విజయ, విశ్వనాథ్‌గారి శిక్షణలో వుత్తమ అభినయాన్ని ప్రదర్శించింది. హీరోగా సత్యనారాయణ, అతడి అర్ధాంగిగా శుభ, ఆమె చెల్లెలిగా భారతి ఆ పాత్రలకు అతికిపోయారు. ప్రతి ఫ్రేములో విశ్వనాథ్ పనితనం కనిపిస్తుంది. మాటలు మధుర మనోహరంగా రాసిన డి. వి. నరసరాజును, మంచి సంగీతాన్ని వినిపించిన మహాదేవన్ను ప్రేక్షకులు అభినందించగలరు. అందరికీ నచ్చే చిత్రం "అమ్మ మనసు" నిర్మాత జి. వి. ఎస్. రాజుకు మంచి పేరును, పేరుతోబాటు పుష్కలంగా డబ్బును ఆర్జించి పెట్టగలదు.

# నాటి శోభన్‌కి నేటి బాబుకి ఎంతో తేడా!

శోభన్‌బాబు ఎంతవాడు అయ్యాడండి అన్నారు తిరుపతి కళాశాల విద్యార్థి బృందం. ఎవర్ని గూర్చి మీరనేది అని ప్రశ్నించాను. శోభన్‌బాబును గూర్చి అన్నారు.

1970 నాటి శోభన్‌కి, 1972 నాటి బాబుకి ఎంతో వ్యత్యాసం కనిపించినట్లు వాళ్ళు చెప్పారు. వాళ్ళన్నది నిజమే. నటనలో పెరిగాడు. ప్రజల హృదయానికి దగ్గరవాడయ్యాడు. నిర్మాతలకు లాభం యిచ్చే నటుడయ్యాడు.

ఇతడి చిత్రాలకు నష్టం రాదు అన్న భావం ప్రతినోటా వినిపిస్తుంది. ఇచ్చిన వేషాన్ని చక్కగా చెయ్యగలడు అన్న ధోరణి ప్రతి దర్శకుడు చెపుతున్నాడు. సమర్థత వున్న కళాకారుడని, సర్దుకుపోయే మనసత్వం గొన్నవాడని, క్రమశిక్షణ పాటించే మనిషి అని అందరూ అంటున్నారు ప్రజలుకూడా శోభన్‌బాబుపై ప్రత్యేక అభిమానాన్ని పెంచుకొన్నారు. ఈ మాట నేను అనగలగడానికి ఆధారం కూడా వున్నది.

## ఈ ఏడు ఎలావున్నాడు?

ఈ సంవత్సరంలో యింతవరకు విడుదలయిన శోభన్‌బాబు చిత్రాలను పరిశీలిద్దాం. కన్నవారికలలు పెద్ద హిట్ కాలేకపోయింది. నిరాశ నివ్వలేదు. ఖయిదీ బాబాయ్ సూపర్ హిట్ అయిన నిజాన్ని ఎవరూ కాదనలేరు. కోడెనాగు ఆశించినంత ఫలితాన్ని యివ్వలేకపోయింది. అందరూ దొంగలే డబ్బును దోచుకుంది. చక్రవాకం కొత్త చరిత్రను సృష్టిస్తే, మంచి మనుషులు మహర్దశను జరుపుకుంటే, దేవుడు చేసిన పెళ్లి దివ్యంగా ఆడగలదు అన్న విషయంలో సంశయం వుండదు. వీటినిబట్టి జమకడితే, 1974 లో శోభన్ వల్ల నష్టపోయిన నిర్మాతలు లేరు అన్నది నిజమేగా.

## రాబోయే చిత్రాలు!

1975 ప్రారంభమే ఉత్సాహభరితంగా వుంటుంది. కారణం. మారుతీ ప్రొడక్షన్స్ వారి వర్ణ చిత్రం "బాబు" విడుదల అవుతుంది. ఇప్పటికి ఏడు రీళ్ల చిత్రం తయారైంది. ఇప్పట్నుంచీ యితర భాషలవాళ్లు ఈ చిత్రాన్ని బేరం అడుగుతున్నారు. ఈ చిత్రానికి చిరంజీవి. రాఘవేంద్రరావు దర్శకుడు. వాణిశ్రీ, లక్ష్మి నాయికలు. శోభన్‌బాబు నట జీవితంలో మరొక మైలురాయి ఈ బాబు వేషం.

సమత ఆర్ట్స్ వారి "జేబు దొంగ" విషయానికొస్తే, యిందులో శోభన్‌బాబుకు శృంగారం, వీరం, కరుణ, హాస్యం అన్నీ ఉన్నాయి. దీనికి వి. మధుసూదనరావు దర్శకుడు. సరికొత్త శోభన్‌బాబు కనిపిస్తాడు. గ్లామర్ గరల్‌గా మంజుల నటిస్తున్నది.

డి. వి. ఎస్. రాజుగారి "జీవన జ్యోతి" లో శోభన్ కరుణరస ప్రధానమైన పాత్రను పోషిస్తున్నారు. ఆంధ్రుల అగ్రనటి వాణిశ్రీ నాయిక. కాశీనాధుని విశ్వనాథ్ దర్శకుడు.

రవి శంకర్ ఆర్ట్ పిక్చర్స్ వారి "బలిపీఠం". ఇందులో భాస్కరరావు వేషం ఎలాంటిదో నవలా పాఠకులకు తెలుసు. రంగనాయకమ్మ రాసిన ఈ నవలకు శారద సినిమా నాయిక. దాసరి నారాయణరావు దర్శకుడు.

పైన చెప్పినవి గాక విజయభట్ మూవీస్, పీనస్ కంబైన్స్, మధు పిక్చర్స్, జెమినీ పిక్చర్స్, ఫల్గుణా కంబైన్స్ నిర్మించే చిత్రాల నాయకుడుగా శోభన్‌బాబు నటిస్తున్నారు.

## మంచి నిర్ణయం

ఇతడు మరొక మంచి నిర్ణయాన్ని తీసుకొన్నాడు. అదేమిటంటే. ఒక్కో చిత్రానికి నాలుగు వారాలు గ్యాపు కావాలని తన నిర్మాతలకు నచ్చచెప్పి, ఒప్పిస్తున్నాడు. ఈ పద్ధతి పెట్టుబడి పెట్టే నిర్మాతలకు, నటించే హీరోకు చాలా ఆరోగ్యకరమైనది.

ఈమధ్య శోభన్‌బాబు యింటికి వెళ్లినప్పుడు, అతగాడి అభిమానులు వ్రాసే ఉత్తరాలను చూశాను. డాక్టర్లు, ఇంజనీర్లు, విద్యార్థులు మరియు యువతులు శోభన్ పట్ల ఎంత ఆత్మీయతా భావాన్ని చూపిస్తున్నారో ఆ ఉత్తరాలు తెలియ చేశాయి. వాళ్ళు కోరేది ఒక్కటే. "వాళ్ల హీరో మరొక నాయకుడితో కలిసి నటిస్తే సహించబోమని. అనుకరణ చిత్రాలను తగ్గించమని."



"బాబు"తో అరుణాయిరానీ



"దేవుడు చేసిన పెళ్లి"లో

శోభన్‌బాబుతో సినిమా నిర్మించాలన్న తలంపు చాలామందికి వున్నది. అందరూ అడిగినా, కొందరికే చేస్తాడు అన్న అనుమానంకొద్దీ ఆయన్ను సమీపించని వ్యక్తులు కొందరయితే, ఆయన ఇష్ట ప్రకారం ఎప్పుడు కాల్‌షీట్లు యిస్తే, అప్పుడే చెయ్యడానికి సిద్ధపడేవాళ్ళు మరికొందరున్నారు. ఎవరు తీసినా, తీయకపోయినా ఒక్క నిజాన్ని మాత్రం ఒప్పుకొంటున్నారు. గ్యారంటీ వున్న హీరో అంటున్నారు.

## సంవత్సరానికి ఎన్ని?

ఆరు చిత్రాలకు మించి చేసే ఉద్దేశం తనకు లేదని శోభన్ చెప్పాడు. అంతకుమించి చెయ్యడం కష్టమే. ప్రతి చిత్రానికి 45 కాల్‌షీట్లు యివ్వాలి. 45 x 6 = 270 రోజులు అవుతాయి. ఒక సంవత్సరంలో 270 పోతే, మిగిలిన రోజులు 95 మాత్రమే. ఆదివారాలు పని చెయ్యడు గాబట్టి 43 రోజులు వుంటాయి. అవుట్‌డోర్ ప్రయాణానికి అవి సరిపోతాయి. అందుకే శోభన్ బాబు ఆరు మాత్రమే చెయ్యడానికి నిర్ణయించారేమో అనిపిస్తుంది. హీరోకి ముఖ్యత్వం వున్న కథలలోనే శోభన్ నటిస్తాడు.

శోభన్‌బాబు ప్రక్కన నటించే హీరోయిన్లందరూ ప్రజలచేత సెహభాష్ అనిపించుకున్నవాళ్ళు గావడం మరొక యస్పెట్. అగ్రనటి వాణిశ్రీ, ఊర్వశి శారద, గ్లామర్ మంజుల సరసన వుండ, విశ్వనాథ్, మధుసూదనరావు, దాసరి లాంటి ఉద్దండులయిన దర్శకులుండ, వెంకటరత్నం, కన్నప్పలాంటి ప్రతిభావంతులుండ, మహదేవన్, చక్రవర్తి లాంటి సంగీత సారథులుండ, శోభన్ బాబు జాతకానికి శుభయోగమే గాని మరొకటి జరుగ తావులేదు

— శ్రీనివాస్

# అద్భుతమైన-
# ఆదా
# బిజ్ వల్ల



2 అత్యుత్తమ
పొదుపైన ప్యాక్‌లు!
తరువాత, బిజ్‌ను 5 రిఫిల్ లేక
2 రిఫిల్ ప్యాక్‌ల నుంచి మళ్లీ
మీ ప్యాక్‌ను నింపుట వల్ల
అద్భుతమైన ఆదా
చేసుకోండి.

అత్యుత్తమమైన
మళ్లీ మళ్లీ వాడదగిన
ప్లాస్టిక్ డబ్బా!
మొదట, ఒక్క పెద్దదైనా అధిక
ఖర్చు అక్కర్లేకుండా బిజ్‌ను
మళ్లీ మళ్లీ వాడదగిన
ప్యాక్‌లో తీసుకోండి.

త్వరగా నురుగు నిచ్చే,
శీఘ్రంగా శుభ్రపరచే **బిజ్** అమోఘమైన
వివిధోపయుక్తమగు శుభ్రపరచే పౌడర్
మీ వంట ఇంటి సామాను, గాజు సామాను,
నేలు మరియు స్నానాల గదులు ఇంతకు
ముందెన్నడూ లేనంత తళతళ మెరయు
చుండునట్లు చేస్తుంది మీకు ఇంతకు
ముందెన్నడూ లేనంత అద్భుతమైన
ఆదా కూడ.




## బిజ్ గోద్రెజ్ ఉత్పాదన

CMGS 60 234 TL

# ధర్మపథం. పిన్నలు–పెద్దలు. బులుసు వేంకటరమణయ్య

మానవులకు బాల్యావస్థ, కౌమారావస్థ, యౌవనావస్థ, వార్ధకం అని నాలుగు అవస్థలు ఆ అవస్థలు వయస్సును బట్టి ఏర్పడును వీటిలో బాల్యావస్థ అజ్ఞానంతో కూడి ఉంటుంది కౌమారావస్థలో విద్యాభ్యాసం చెయ్యవలసి వుంటుంది యౌవనావస్థలో వివాహం జరుగుటకు ముందు ఉండే కాలమే ఉత్తమమైనదని నిర్ణయం

ఆ వయస్సులో మనిషి నిర్విచారంగా ఉంటాడు సంసార బాధ్యత ఏవీ ఉండదు ఉన్నదీ, లేనిదీ ఏదీ తలపులోకి రాదు అందువల్ల మనస్సు నిర్మలంగా ఉంటుంది భగవద్ధ్యానాదులకు అదే అనుకూలమైన వయస్సు

గృహస్థు అయిన తర్వాత భార్యనూ, సంతానాన్నీ, తనపై ఆధారపడి వున్న తలిదండ్రులనూ పోషించవలసిన బాధ్యత ఉంటుంది అందుకోసం సర్వ విధాలా ప్రయత్నం చెయ్యడం కోసమే ఆలోచన కలుగుతుంది చాలా సమయాల్లో శాంతి ఉండదు మనస్సు నిర్మలంగా ఉండదు పూర్వం పరిపూర్ణంగా ఉండే మనస్సులో సగం భాగం గృహిణి తీసుకుపోతుంది సంతానం నాల్గవ వంతును స్వీకరిస్తుంది మిగిలిన నాలుగవ వంతు తలిదండ్రుల మీదా, వేష భాషల మీదా, కీర్తి సంపాదనయందు వ్యాపించి ఉంటుంది



ఇక వార్ధకావస్థలో మనిషికి తాపత్రయం ఎక్కువవుతుంది తన సంతాన విషయమయి మాత్రం కాకుండా మనుమలు, మనుమరాండ్ర విషయమై ఆదుర్దా అధికంగా ఉంటుంది చాపల్యం ఎక్కువవుతుంది కోరికలు అధిక మవుతాయి భగవన్నామమును స్మరించడానికయినా అవకాశం దొరకదు పారమార్థిక దృష్టితో చూస్తే ఈ వయస్సులో మనస్సు పూర్తిగా స్వాధీనం తప్పిపోతుంది మంచి వయస్సులో ఎంతో ఉదారులై ఉన్నవారు వార్ధక్యంలో ఔదార్యం నశించి, అతి సామాన్యులుగా ప్రవర్తించడం సర్వ సాధారణంగా కానవస్తుంది

మనస్సు సంపూర్ణంగా స్వాధీనంలో ఉన్నప్పుడే– అనగా – మనిషి ఎన్నగా ఉన్నప్పుడే మనస్సు కోమలమయి ఉన్నందున భగవంతుణ్ణి తెలుసుకోవడం సులభం అప్పుడే ఆ విషయమై అభ్యాసం చేస్తే, వయస్సు మళ్ళి, మనస్సు విభిన్న విషయాలపై పోయినా, అందులో భగవజ్జిజ్ఞాసకున్నూ తావు తప్పకుండా ఉండగలదు

## డాక్టర్ సలహాలు —డా కె వెంకటేశ్వరరావు

ఎ ఎస్ ఎస్ – కర్నూల్

చక్కెర వ్యాధి మానవునికి ఏవిధంగా వస్తుంది? వ్యాధి లక్షణాలు, ముందు జాగ్రత్తలు ఏమిటి?

★ చక్కెర వ్యాధిని – వైద్య శాస్త్రంలో డయాబెటిస్' అంటారు సాధారణంగా కనబడే దానిని 'డయాబెటిస్ మెలిటస్' అని వ్యవహరిస్తారు

ఇది ఎక్కువగా వంశపారంపర్యంగా రాదగినా కొన్ని అలవాట్లు అంటే– ఆహార విషయంలో నియమం పాటించక పోవటం, తగిన వ్యాయామం లేక పోవటం, మితిమీరి తీపి పదార్థాలు తినటం మొ వాటి మూలంగా ఎవరికైనా రావచ్చును

పైన చెప్పిన వాటికి తగిన జాగ్రత్తలు తీసుకొంటే కొంతవరకు దీనిని రాకుండా చూసుకోవచ్చు కదా?

ఒక సోదరి – పూనా

'నాకు కంటి రెప్పల క్రింద పది రోజుల కొకసారి గుల్లలు లేచి చీము పడుతున్నాయి ఆపరేషన్ చేసి తీసి వెయ్యాలని చెప్పారు

★ కంటిమీద తరచూ ఇలా రావటం 'కలేజియాన్' అనే దాని వల్లనే కంటిరెప్పలలో వున్న కొన్ని గ్రంధుల నాళములు అడ్డుపడటం వల్ల ఇలా జరుగుతుంది

దీనికి ఆపరేషన్ చేసి తీయటమే మంచిది కాటిక ఎక్కువ ముద్దగా పెట్టుకొంటే తిరిగి ఇలా వచ్చే అవకాశం వున్నది

డి ఎస్ – రౌర్‌కెలా–2

మా అబ్బాయి వయస్సు 2 సం లు వాలిక క్రింద భాగమంతా కలిసే వుంటుంది వాలిక కొస లేదు

★ దీనిని 'టంగ్–టై' అంటారు వాలిక క్రింద వున్న పన్నని పొర పెరగనప్పుడు ఇలా జరుగుతుంది

దీనికి చిన్న శస్త్ర చికిత్స ద్వారా వైద్యం చెయ్యాలి ప్రమాద మేదీ లేదు వెంటనే చేయిస్తే మాటలు సక్రమంగా రావటానికి అవకాశం వున్నది

కె పి ఆర్ – మద్రాసు

'స్క్రోటం' (బీజ సంచి) ఆపరేషన్ చేసి తీసివేసి బీజములను తొడలో అమర్చినప్పుడు పిల్లలు పుట్టే అవకాశం వున్నదా?

★ తప్పకుండా పుట్టే అవకాశం వున్నది స్థాన చలనం జరిగిందే కాని, నిర్మాణములో మార్పు చెయ్యలేదుగా, వీర్యం పోయే మార్గంలో (వాస్ డిఫరెన్స్) అవరోధం లేదు కాబట్టి ఎటువంటి అనుమానం అక్కరలేదు

ఎ ఎన్

నాకు శరీరంలో ఎక్కువ దురదగా వుంటుంది గోకితే నెత్తురు వస్తుంది తర్వాత నల్లటి మచ్చ ఏర్పడుతుంది దీని నివారణోపాయం చెప్పండి

★ శరీరంలో ఎక్కువగా అలర్జీ వున్నవారికి తరచూ ఇలా రావటం సహజం ఈ అలర్జీకి కారణం కనుగొని చికిత్స చేయవలసి వుంటుంది మల పరీక్ష, నెత్తురు పరీక్ష అవసరం

చేయవలసిన వైద్యం – ఈ పరీక్షల ఫలితాలను బట్టి వుంటుంది మలములో క్రిములు వున్నప్పుడు వాటికి తగిన మందులు వాడాలి

అంతవరకూ, కాల్షియం మాత్రలు, లేక ఇంజెక్షన్లు, ఎరిటాన్ మాత్రలు పూటకి సగం చొప్పున 10 రోజులు వాడితే గుణం కనబడుతుంది విటమిన్ 'సి' మాత్రలు రోజుకి రెండు (500 మి గ్రా) తీసుకొంటూవుంటే నల్ల మచ్చలు రావు

జి కె కె – వంగనూరు

మృత శిశువులు పుట్టడానికి కారణాలు ఏమై వుంటాయి?

★ స్టిల్ బర్త్' అనే మృత శిశువు జన్మించడం – ఎన్నో కారణాల వల్ల జరుగుతుంది

తల్లి గర్భవతిగా వున్నప్పుడే రాగల టాక్సీమియా (కాళ్ల వాపులు మొ), ఇతర రోగాలు, ప్రసవ సమయంలో తగిన సహాయం లేక –, శిశువులో పెరుగుదల లేకపోవటం, ఇతర మార్పులు, గర్భాశయంలో శిశువు యొక్క పొజిషన్, మొదలగునవి ముఖ్య కారణాలు

గర్భవతిగా వున్నప్పుడే క్రమబద్ధంగా పరీక్ష చేయించుకొని, తగిన వైద్యం చేయించుకొంటే ఈ మరణాలు తగ్గిపోతాయి

ఒ ఆర్ – సికిందరాబాద్

నాకు 1970లో టి బి వచ్చింది హాస్పటల్‌లో చికిత్స చేశారు 1 సం వైద్యం చేయించుకొన్నాను ఈ మధ్య తల నెప్పి కళ్ల మసకగా వుండటం జరుగుతున్నది

కొన్నిసార్లు–'డైహైడ్రో స్ట్రెప్టోమైసిన్' ఎక్కువ అవటం వల్ల, ఆహారం సరిగా లేకపోవటం వల్ల, అలసట వల్ల ఇలా జరుగుతుంది ఎక్కువ ప్రోటీనులు గల ఆహారం, తగినంత విశ్రాంతి – అవసరం

ఎక్కువ పాలు, 'బి' కాంప్లెక్స్ మాత్రలు, బి1 ఇంజక్షన్లు చేయించుకోవాలి

# విటమిన్లు మరియు ఖనిజములు మీ కుటుంబము యొక్క ఆరోగ్యమునకు ఎంతో అవసరము




## వారికి తగినన్ని లభిస్తున్నాయా?

విటమిన్లు మరియు ఖనిజముల లోపముతో మీ కుటుంబపు ఆరోగ్యము పాడవవచ్చును. అలసట, జలుబు, ఆకలి లేకపోవడము, నిరుత్సాహము, చర్మము మరియు పళ్ల బాధలు మొదలైనవన్నీ అవసరమైన విటమిన్లు మరియు ఖనిజముల లోపమువల్ల మామూలుగా కలుగుతాయి

విటమిన్లు మరియు ఖనిజముల లోపము సమృద్ధియైన ఆహారములో కూడ ఉండవచ్చును కనుక మీ కుటుంబములో ప్రతి ఒక్కరికి నిశ్చయముగా యీ అవసరమైన పోషక పదార్థములు కావలసిన పరిమాణములో లభించుటకు, వారికి రోజూ ఒక విమ్‌గ్రాన్ బిళ్ల యివ్వండి

విమ్‌గ్రాన్‌లో ముఖ్యమైన 11 విటమిన్లు మరియు 8 ఖనిజ పదార్థములు ఉన్నాయి ఇనుము—రక్త వృద్ధికి, చురుకుదనమును యిచ్చుటకు, కేల్షియమ్—ఎముకలను మరియు పళ్లను బలిష్ఠముగా చేయుటకు, విటమిన్ సి—జలుబు రాకుండా అడ్డుటకు, విటమిన్ ఎ—తేటయైన కళ్ల మరియు ఆరోగ్యమైన చర్మమునకు, విటమిన్ బి$_{12}$—ఆకలిని అధికము చేయుటకు మరియు శరీర ఆరోగ్యమునకు ఇంకా యితర ముఖ్యమైన పోషక పదార్థములు ఉన్నాయి.

# విమ్‌గ్రాన్®

వివిధ విటమిన్లు మరియు ఖనిజములుగల బిళ్లలు
11 విటమిన్లు + 8 ఖనిజ పదార్థములు



SQUIBB®
SARABHAI CHEMICALS PVT LTD

® ఇ ఆర్ స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం దీని లైసెన్సుదు ఉపయోగదారులు ఎస్‌సిఎల్

## ఒక విమ్‌గ్రాన్ మిమ్మల్ని రోజంతా శక్తివంతముగా ఉంచుతుంది

Shilpi HPMA 2A/74 Tel

# గంగిరెద్దులు

## రామ్ దివాకర్

### "కొక్కొ రో — కో"

*మూర్తి నిద్ర లేచేసరికి కోడి కూత వినబడింది. మూర్తికి కోడి కూత వలన మెలకువ రాలేదు.*

*అసలా కోడి టైఫాయిడ్ వచ్చిన రోగికి మల్లే నీరసంగా అరుస్తుంది. మూర్తికి మెలకువ రావటానికి కారణం, వంటింట్లో గిన్నెలు పెద్దగా శబ్దం చేస్తూ దొర్లటం.*

వళ్ళు విరుచుకొని కిటికీలోంచి బయటకు చూసాడు మూర్తి. పంతులుగారి పెద్దమ్మాయి వాకిట్లో ముగ్గులు పెడుతున్నది. ముగ్గులు పెడుతున్నది—అనేకంటే ముగ్గులో అలుకుతూంది.

అందంతో పాటు ఆ అమ్మాయికి భగవంతుడు సక్రమమైన బుర్ర ప్రసాదించలేదు. అందుకే మూర్తి ఒక్కొక్కసారి భగవంతుడిని పసిదీరా తిట్టి, ఆనక భయంతో గుడికి వెళ్ళి కొబ్బరికాయ కొట్టి, సాష్టాంగ నమస్కారం చేసి మరీ వస్తాడు. మూర్తి భగవంతుడిని పసిదీరా తిట్టాడంటే దానికి కారణం అతను అనుభవించిన వాతల బాధ!

ఆ గ్రామానికి క్రొత్తగా వచ్చినప్పుడు, అంటే సరిగ్గా పది దినాల క్రితం — గ్రామం చూడటానికని బయలుదేరాడు మూర్తి. పంతులుగారి పెద్దమ్మాయి వాకిట్లో నుంచొని వుంది. నుంచొని వుంటే నుంచుంది, ఏగాదిగా మూర్తిని చూడ సాగింది. పట్నంలోనే అమ్మాయిల్ని కన్నెత్తి చూడని అపర లక్ష్మణుడు మూర్తి. పంతులుగారమ్మాయి అలా చూస్తుంటే గుండె దడదడ లాడింది.

"ఏమండోయ్!"

—కొయ్యబారిపోయాడు మూర్తి. ఆ అమ్మాయి పిలిచింది తననేనా? వెనక్కి తిరిగి చూసాడు ఆ అమ్మాయి లేదు! గబగబ నడుచుకుంటూ వెళ్ళిపోయాడు

ఊరంతా తిరిగి మధ్యాహ్నం వేళకు ఇంటి దారి పట్టాడు. ఎండ బాగా వుంది. చెమట బాగా పట్టింది మూర్తికి.

"ఏమండోయ్!"

అదే పిలుపు, అదే స్వరం.

ఆ అమ్మాయి గుమ్మానికానుకొని నుంచొని వుంది.

"మిమ్మల్నే, లోపలికి రండి."

గుడు తేలేయబోయాడు. పంతులుగారు కానీ రమ్మని పిలిచారేమోనని లోపలికి నడిచాడు లోపల ఎవ్వరూ కనబడలేదు.

"అమ్మ జాతర కెళ్ళింది, నాన్నగారు స్నానం చేస్తున్నారు" అంది బిత్తరపోయాడు. 'జాతరేమిటి నాబొంద!, ఇక్కడేం జాతర?' అనుకున్నాడు 'అయినా పల్లెటూరి పిల్ల'... మరీ యింత ఫ్రీగా, పబ్లిక్కుగా మగాళ్లతో మాట్లాడేస్తుందేవిటి?!'

"తీసుకోండి ..." అంటూ చిన్న ప్లేటులో ఏదో తెచ్చిపెట్టింది. అదే పదార్థమో అర్థం కాలేదు మూర్తికి ఈపల్లెలో ఇటువంటివి చేస్తారేమోలే — అనుకుంటూ నోట్లో వేసుకున్నాడు. అంతే! ఒక్కసారి కక్కేసాడు అంతా ఉప్పు, కారం!

"ఏమిటండీ బాగోలేదా?" నెమ్మదిగా అడిగిందా అమ్మాయి. చిర్రెత్తు కొచ్చింది మూర్తికి. 'నాబొంద ...' అనబోయి ...

| పెద్దకథ ప్రారంభం! |
|---|

అనలేక... "నీ...నీళ్ళు" అన్నాడు గిలగిల లాడుతూ.

ఆ అమ్మాయి నీళ్ళిచ్చింది. నోట్లో పోసుకోబోయి, ఠక్కున ఆగి, కళ్ళు పెద్దవి చేసి చూసాడు. దాంట్లో చిన్న చిన్న పురుగులు... ఇంకా ఏవేవో 'స్విమ్మింగ్ పూల్'లో ఈతకొట్టినట్లు చక్కగా కొడుతున్నాయి.

"ఛీ ఛీ?" అంటూ గ్లాసు కిందపడేసాడు మరుక్షణంలో అట్లకాడతో ప్రత్యక్షమయిందా అమ్మాయి. కాలుతున్న అట్లకాడను చూడగానే, "అబ్బే ... నాకు దోసెలు తినే..." మాట పూర్తి చేయకుండానే, "అమ్మో!" అన్నాడు. చేతిమీద వాత పడింది. వీపుమీద కాలిమీద ..

పంతులుగారొచ్చి అట్లకాడలాగి, ఆ అమ్మాయిని గదిలోకి తోసి, గొళ్ళెం పెట్టారు. ఇంచు మించు మూర్తికాళ్ళు పట్టుకున్నంత పనిచేసి, క్షమాపణ అడిగి, అసలు సంగతి చెప్పారు

— ఆ అమ్మాయికి పుట్టుకతోనే మతి స్థిమితం లేదు!

ఆ తర్వాత మరల మూర్తి ఎప్పుడూ పంతులుగారింట్లో కాలు పెట్టలేదు.

"మూర్తీ! లేవావా?" జయమ్మ పిలుపుతో ఈ లోకానికి వచ్చాడు

"లేచానత్తయ్యా!" అన్నాడు మంచం దిగుతూ

దుప్పట్లుమడిచి,పరుపు చుట్టాడు పండ్ల పొడి అరచేతిలోవేసికొని పెరట్లోకి నడిచాడు.

వెనకింట్లో వాళ్లమ్మాయి హార్మోనియం వాయిస్తూ సంగీత సాధన చేస్తున్నది. ఆ గాత్రం కర్ణకఠోరంగా వుంది.

కొంచెం సేపు ఆ గాత్రం ఆగిపోయింది. 'హమ్మయ్య' అనుకున్నాడు.

హార్మోనియం శబ్దం వినిపించింది. మూర్తికి ఆశ్చర్యం కలిగింది. హార్మోనియం మీద చక్కని పాట ఇంపుగా వినిపిస్తోంది. 'ఆ అమ్మాయి కింత నేర్పు ఎక్కడుందబ్బా—' అనుకున్నాడు వరుసగా అయిదారు హిందీ పాటలు కూడా వినిపించాయి

ముఖం కడిగేసుకొని, లోపలికి వచ్చాడు.

"ఆ అమ్మాయి సినిమా పాటలు బాగా

వాయిస్తున్నది కదత్తా!?" అన్నాడు

"ఆ అమ్మాయి కాదు వాళ్ల బావ వచ్చాడు అతనికి బాగావచ్చు .." నవ్వుతూ అంది

"అలా—చెప్పు ఆవిడకింత నేర్పు ఎక్కడిదానుకున్నాను .."




కాఫీగ్లాసు తీసికొని ముందు గదిలోకి వచ్చాడు

* * *

"ఏమయ్యోయ్. మూర్తీ!"

మూర్తి ఆగాడు పంతులు గారొస్తున్నారు

"వంట్లో బావుంది కదా ?!" అడిగారు, తన కూతురు చేసిన ఘనకార్యాన్ని తలుచుకుంటూ

'ఏదో మీ అమ్మాయి దయవల్ల " అందామనుకున్నాడు. బాగోదని, "బావుందండీ ." అన్నాడు

"అప్పుడే నీకేమయినా తోస్తున్నదా ?"

వెంటనే సమాధానం ఈయలేకపోయాడు మూర్తి

"క్రొత్త కదండీ! అలవాటుపడితే "

"అదీ నిజమే "

కొంచెంసేపు మౌనంగా నడిచారు

"ఈ వూర్లో చదువుకున్న యువకులెవరైనా వున్నారా మాస్టారూ?—" హఠాత్తుగా అడిగాడు మూర్తి

కాస్త ఆలోచించారు పంతులుగారు.

"వ్చ్ చదువుకున్న యువకులు లేరు కానీ యువకులు మాత్రం చాలామంది ఉన్నారోయ్"

నిట్టూర్చాడు మూర్తి.

"మరి నే వస్తానోయ్ స్కూలుకి వెడుతున్నా " పంతులుగారు మలుపు తిరిగారు

మూర్తి ఊరుదాటి పొలాల దగ్గరకు

# సెట్టు మీద మర్చిపోలేని హాస్య సంఘటన

ఈ మధ్య సెట్లో జరిగే సంఘటనలన్ని హాస్యాన్ని తెప్పిస్తున్నాయి అన్నది సూర్యకాంతం. మరి ఆ హాస్యాన్ని మా పాఠకులకు కూడా చెప్పండి అన్నాను. ఇటీవల రంజిత్ మూవీస్‌వారి రంగులచిత్రం షూటింగుకని విజయా స్టూడియో కెళ్లాను. నాకు, మరొక నూతన తారకు విశ్రాంతి తీసుకోవడానికి ఒకే రూమ్‌ను ఏర్పాటు చేశారు నిర్మాత. తీరా నేను రూము లోపలికెళ్దామని బయల్దేరే సరికి ఆ నూతన తార తల్లి అక్కడున్న మరొక వ్యక్తితో *''యారన్న యారు వరాంగ ఇంద రూమ్‌కు. ఇది



ఎంగళుకు మాత్రం దాన్ సొల్లంగో'' అంటోంది. ఆ మాట విన్న నేను నాలో నవ్వుకున్నాను. అంతకు ముందుగానే నేను, సత్యనారాయణ, రాజబాబు పేకాట ఆడుతూ, రెండు వందలు నాడబ్బు పోయింది. ఎంత పోయిందని అడిగింది ఆనూతన తార అమ్మ. రెండువంద లన్నాను. ''పణత్తిమిరు'' అంది. గొల్లున నవ్వి ఇలా సమాధాన మిచ్చాను. నీ కూతుర్నిచూచి పదిమంది నిర్మాతలు వస్తారని నీకే ఆ తిమిరు. కానీ నాకు తిమిరుకాదు. ధైర్యం. బిడ్డలా, తోబుట్టువులా చూచే నిర్మాతలు నాకెప్పుడూ దగ్గరగానే వుంటారు. దాంతో ఆవిడ సర్దుకుంది. ''ముందొచ్చిన చెవులకన్నా, వెనకొచ్చిన కొమ్ములు మిన్న'' అన్నట్లు ఈనాటి క్రొత్త తారలు ప్రవర్తించే తీరు తెన్నులు ఎప్పుడు జ్ఞాపకానికొచ్చినా నవ్వు ముంచుకొస్తుంది నాకు. చూచినా చూడనట్లు నటిస్తారు కొందరు. తెల్సివున్నా మాట్లాడడానికి విసుక్కుంటారు మరికొందరు. సెట్లో ఇలాంటి సంఘటనలు జరుగుతున్నప్పుడల్లా నాకు నవ్వొస్తూనే వుంటుంది.

— శ్రీనివాస్

* ఎవరొస్తారు ఈ గదికి. ఇది మాకుమాత్రమే అని చెప్పండి.

## గంగిరెద్దులు

వచ్చాడు. పొలంలో ఆడా, మగ పనిచేస్తున్నారు. గట్టుమీద చెట్టునీడన కూర్చున్నాడు.

చల్లనిగాలి శరీరానికి తాకుతున్నది. కళ్ళు మూసుకొని కూర్చున్నాడు అలా ఎంతసేపు కూర్చున్నాడో అతనికే తెలియదు.

వెనుక అడుగుల చప్పుడవటంతో ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు.

''నమస్తే!''

ఆశ్చర్యంగా చూసాడు మూర్తి. ఒక యువకుడు.

పల్లెయువకుడు కాదు! పట్నపువాసి.

''నమస్తే!'' ప్రతి నమస్కారం చేసాడు

''నేను మీ యింటి వెనుక వుండే సుందరరామయ్యగారి మేనల్లుడిని ... '' తనను పరిచయం చేసుకున్నాడా యువకుడు

''ఓ...'' అన్నాడు మూర్తి.

''మీ ఇంటికి వెళ్తే పిన్ని...మీరు ఇక్కడకు వెళ్లినట్లు చెప్పారు. మీపేరు మూర్తి కదూ?'' అడిగాడు కూర్చుంటూ.

''అవును. మీపేరు ?...''

''రమణ. కాకినాడలో ఇంజనీరింగు చదువుతున్నా. మీరు...''

''బి. ఎస్‌సి. పాసయ్యాను.''

''నెక్స్ట్... ఉద్యోగమా ?. లేక ... పోస్టు గ్రాడ్యుయేషన్‌కి వెళ్తారా ?...''

''రెండూ కాదు. ఇక్కడుండి పోదామని వచ్చాను. మా అత్తయ్య రమ్మని వ్రాసింది. ఆమెకు ఎవరూ తోడులేరు. వయసు మళ్ళుతున్నది ... ఎలాగూ ఈకాలంలో ఉద్యోగం దొరకదుకదా !''

''మీ నాన్నగారు...''

''నాకు అమ్మానాన్న లేరు...'' అమ్మ చిన్నప్పుడే పోయింది. నాన్న సంవత్సరం క్రితం పోయారు.''

''ఐయామ్ సారీ...'' అన్నాడు రమణ నొచ్చుకుంటూ.

కొంచెంసేపు యిద్దరూ మాట్లాడలేదు.

''మీకు ఈ పల్లెలో ఏం తోయదను కుంటాను'' అన్నాడు రమణ మౌనాన్ని భరించలేక.

''నిజమే. పల్లెజీవితానికి అలవాటుపడాలి. చదువుకున్నవాళ్ళు వుంటే కాలక్షేపం అవుతుంది.''

పుల్లతో నేలమీద వ్రాస్తూ కూర్చున్నాడు రమణ.

''మీ సొంతవూరు ఇదేనా ?...'' మూర్తి అడిగాడు.

''ఇక్కడకు దగ్గరే. నాలుగు మైళ్ళు. నీరపట్నం.''

సూర్యుడు నడినెత్తి మీదకు వచ్చాడు. ఇద్దరూ లేచారు వెళ్ళటానికి.

ఇంటికి వెళ్ళగానే జయమ్మడిగింది, ''ఇంతాలస్యం అయిందేం మూర్తీ ?''

''సుందరరామయ్యగారి మేనల్లుడు రమణ కలిసాడత్తయ్యా ... మాటల్లో పడ్డాము'' అన్నాడు.

''ఇక్కడకు వచ్చాడు...''

''ఆ చెప్పాడు'' అన్నాడు షర్టు విప్పుతూ.

* * *

గోధూళి వేళ. పాలేర్లు ఎడ్లను ఇండ్లకు తోలుకు పోతున్నారు. రావిచెట్టు అరుగు మీద రాయుడు గారు, రామయ్యగారు, చౌదరి, కనకయ్య, రాఘవయ్య కూర్చున్నారు.

''అయితే బాబుగోరూ ... తూర్పు వైపు పొలం ఎప్పుడు బాగు సేయమన్నారండీ?...'' వినయంగా చేతులు కట్టుకొని అడిగాడు రాముడు.

రాముడు రాయుడిగారి పెద్ద పాలేరు.

''అమావాస్య వెళ్లనీరా...?'' అన్నారు రాయుడు గారు.

ఆయన ఆగ్రామ ప్రెసిడెంటు. ఆరడుగుల విగ్రహం. అక్కడక్కడా నెరిసిన వెంట్రుకలు.

''అట్టాగేనండి. ఇంటికాడకు పోయొత్తానండీ. అమ్మగారు కబురంపారు'' రాముడు వెళ్లిపోయాడు.

చుట్ట బయటకు తీసి అంటించారు రాయుడుగారు.

''సిమ్మెంటసలు దొరకటమే లేదు

కదయ్యా !?" అన్నారు అగ్గిపుల్ల విసిరేస్తూ.

"నిజమేనండి. మొన్న నర్సింహం గారికి బ్లాకులో కూడా దొరకలేదు" కనకయ్య అన్నాడు. కనకయ్య ఆవూరి పెద్దల్లో ఒకడు.

"తమరు తలుచుకుంటే సిమెంటు దొరకక పోవటమేమిటండీ ?" రాఘవయ్య అన్నాడు. రాఘవయ్య కూడా వూరి పెద్దల్లో ఒకడు.

"ఇదివరకు మనకు ప్రసాదరావుండేవాడు. ఇప్పుడతను లేడు..."

"నిజమే" అన్నాడు రాఘవయ్య:

చుట్ట గుప్పు గుప్పుమని పీల్చి పొగవదిలారు రాయుడుగారు.

కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయి.

"చిన్నరెడ్డి నిన్న కనిపించాడండి" హఠాత్తుగా అన్నాడు చౌదరి. చౌదరి భూస్వామి.

"ఏమంటాడు?" అడిగారు రాయుడుగారు.

ఈ సారి ఎలక్షన్లో నిలబడతాడంట"

"ఏమిటీ ! చిన్నరెడ్డే !?" ఆశ్చర్యంగా అడిగారంతా.

రాయుడుగారు మాత్రం ఆశ్చర్యపోలేదు. ఆయనకు రాజకీయాలు బాగా తెలుసు. అందుకే ప్రెసిడెంటు కుర్చీని వదలకుండా బంకలాగా పట్టుకున్నారు.

"చిన్నరెడ్డి ఈ సారి కౌన్సిలర్‌గా నిలబడతాడంట" చౌదరన్నాడు.

"మరి పెద్దరెడ్డి ?" రామయ్యగారడిగారు.

"పెద్దరెడ్డి ఈసారి గెలవలేడంట..."

రాయుడుగారు మౌనంగా వింటున్నారు.

చిన్నరెడ్డి, పెద్దరెడ్డి స్వయానా ఒకతల్లి బిడ్డలు. వాళ్లదీ గ్రామమే. పది సంవత్సరాల క్రితం పట్నంలో స్థిరపడ్డారు. అక్కడ పేరు గడించారు. పెద్దరెడ్డి పోయినసారి గెలిచాడు. అప్పుడు చిన్నరెడ్డి పెద్దరెడ్డికి సపోర్ట్ చేసాడు ఇప్పుడిద్దరూ నుంచుంటున్నారు. ఒకరి కొకరి పోటీ...

చుట్ట పారేయబోతూ ఠక్కున ఆగి అడిగారు రాయుడుగారు.

"రామయ్యా ! ఆ కుర్రాడెవరూ ?"

రామయ్య చూసాడు.

"జయమ్మగారి మేనల్లుడండీ...మూర్తి"

"ఓహో..."

"వాళ్ల నాన్నపోతే...ఇక్కడకు వచ్చాడు బి. ఎస్‌సి. ఫస్టుక్లాసులో పాసయ్యాడు." రామయ్య చెప్పారు.

# గంగిరెద్దులు

'కుర్రాడు బాగానే వున్నాడు' మనసులో అనుకున్నారు రాయుడుగారు.

* * *

ఉదయం పదిగంటలు కావస్తోంది.

మూర్తి ఆలోచిస్తూ నడుస్తున్నాడు. రమణ వుండి వుంటే కాస్తయినా తోచేది. రమణ వాళ్లవూరు వెళ్లిపోయాడు.

ఆలోచిస్తూ హైస్కూలు దగ్గరకు వచ్చాడు.

దగ్గర్లో చెట్టుక్రింద ముగ్గురు పిల్లలు కూర్చున్నారు లెక్కలతో అవస్థపడుతున్నారు.

"ప్చ్...ఆన్సర్ తప్పరా..."అన్నాడొకడు.

పుస్తకంలో గీస్తున్నారు ఆన్సర్స్ చూస్తున్నారు.

మూర్తి దగ్గరకు వెళ్లాడు. మూర్తిని తెల్లబోయి చూసారు ఆ పిల్లలు.

"ఏ క్లాసు ?" అడిగాడు.

"తొమ్మిదండీ."

"కాంపోజిట్టా ?"

అవునన్నట్లు తలూపారు.

"లెక్కలతో కుస్తీపడుతున్నారు. రావటం లేదా ?"

"రావటంలేదండీ, ఎంత చేసినా."

"మీ మాస్టార్ని అడగండి."

"అసలు మా మాస్టారికి వస్తేకదండీ." నవ్వారు ముగ్గురూ.

"ఏమిటీ ?" ఆశ్చర్యంగా అన్నాడు.

"మీకు తెలియదాండీ ? ... మా మాస్టారికే సరిగా రావు. రాత్రి గైడులో చూసుకొని ప్రొద్దున్నే మాకు చెప్తారు."

కొంచెంసేపు మాట్లాడలేదు మూర్తి.

"... మీ మాస్టారికి లెక్క రాలేదని చెప్పండి." అన్నాడు.

"అలాచెప్తే వూరుకోరండీ. తంతారు." చెప్పాడొక కుర్రాడు.

"తన్నడమెందుకు ?"

"ఆయన దగ్గర ప్రయివేటుకు వెళ్లని వాళ్ల లెక్కలు చేయకపోతే ఆయన వూరుకోరండీ."

ఏమనటానికి తోచలేదు మూర్తికి.

"నేను చేస్తాను... యిలా యివ్వండి" అన్నాడు చివరకు.

ఒక కుర్రవాడు సంతోషంగా పుస్తకం అందించాడు

"అయిదో లెక్కండీ..." అన్నాడు.

మూర్తి ఆ లెక్క చదివాడు. ఆల్జీబ్రా. నిజంగా వాళ్ళ వయసుకు కష్టమైనదే.

మూర్తి లెక్క చేసాడు.

"ఆన్సరొచ్చిందండీ !" సంతోషంగా అరిచారు ముగ్గురూ. వాళ్ళడిగిన మరో మూడు లెక్కలు చేసి చూపించాడు మూర్తి.

"చాలా థాంక్సండీ ..." మనసుపూర్తిగా కృతజ్ఞత చెప్పారు.

"నో మెన్షన్ ..." అయిదడుగులు వేసి ఠక్కున ఆగాడు.

అతనికో ఆలోచన వచ్చింది.

"చూడండి బాబూ! మీకేమైనా లెక్కలు రాకపోతే నాదగ్గరకు రండి చెప్తాను" అన్నాడు.

"ఓ... తప్పకుండా వస్తామండీ" సంతోషంగా అన్నారు.

"మీయిల్లెక్కడండీ?"ఒక కుర్రాడడిగాడు.

---

## మజ్జిగ పొలుసు

ఇది కన్నడం వంట, మనం చేసుకునే మజ్జిగ పులుసుమాదిరి ఉన్నా, చాలా రుచిగా వుండి, దీన్ని అన్నంలోకి చపాతీలకి కూడా తీసుకోవచ్చు

కావలసిన వస్తువులు : చిక్కని మజ్జిగ ఓ పెద్దగ్లాసెడు, పచ్చి కొబ్బరిచిప్ప చిన్నది ఒకటి, పచ్చిమిరపకాయలు రెండు, వేయించిన శెనగపప్పు ఒక టేబుల్ స్పూను, వుప్పు తగినంత, ఇంగువ చిన్నముక్క, కరివేపాకు ఒక రెబ్బ. దోసకాయ ఒకటి.

తయారుచేసే విధానం :

దోసకాయ ముక్కలు కొంచెం లావుగా తరిగి, గిన్నెలో నీళ్ళుపోసి, స్టౌవ్‌మీద పెట్టి, కొంచెం ముక్క మెత్తపడంగానే, వాటిని మజ్జిగలో వేయాలి. పచ్చికొబ్బరి, వేయించిన శెనగపప్పు, పచ్చి మిరపకాయలు, వుప్పు వేసి రుబ్బి, ఈ రుబ్బిన ముద్ద కూడా మజ్జిగలోవేసి ఓ పొంగు రానివ్వాలి. ఇది అడుగంటకుండా కలియపెడుతూ, తిరిగి నాలుగు పొంగులు రాంగానే, మెంతులు, ఆవాలు, శెనగపప్పు, ఇంగువపోపు వేసి, దించేముందు కరివేపాకు వేయాలి. ఇది చిక్కగా, గరిటెజారుగా వుంటుంది కాబట్టి దోసెలోనికి కూడా బావుంటుంది.

— లక్ష్మీ ప్రభామూర్తి

ఎల్ ఐ సి పాలిసీ హోల్డర్ల ప్రయోజనంకోసం ప్రకటించ బడింది

# మీ ఎల్ ఐ సి ప్రీమియంలు సకాలంలో చెల్లించండి, సరియైన ఆఫీసులో




## క్లెయిము చెల్లింపును త్వరిత పరచుటకు అది సహాయపడుతుంది

మీ లైఫ్ ఇన్సూరెన్స్ ప్రీమియములు గడువు తేదీలలో చెల్లించడం అతి ముఖ్యం. సరియైన ఆఫీసులో ప్రీమియములు చెల్లించడం, మీ పాలిసీ నంబరు తెలియపరటం కూడా చాలా అవసరం. మీ ప్రీమియం నోటీసును మీరు పంపే డబ్బుతో బాటు జతపరచి పంపండి, లేక పోతే మీ ప్రత్యేక పాలిసీకి ప్రీమియం జమ చేయటం రసీదు ఇవ్వడం కష్టం. దీని ఫలితంగా పాలసీ గడవు తీరగానే మీ క్లెయిము చెల్లింపు ఆలస్యం కాగలదు.

మీ ఇన్సూరెన్స్ క్లెయిముల చెల్లింపులో ఆలస్యములను తొలగించుటకు మీరు తీసుకొనలసిన ఇతర చర్యలు మీ బెనిఫిషియరీని వెంటనే పేర్కొనండి. వయస్సును గూర్చిన ఋజువును దాఖలు చేసి, దానిని మీ పాలిసీలో నమోదు చేయించండి. ఎల్ ఐ సికి మీ చిరునామా మార్పు ఏదైనా ఉన్నచో తెలియపరచండి.

మీరు పాలిసీ తీసుకొన్న ఎల్ ఐ సి ఏజంటునుంచి సహాయం పొందండి — లేక సమీపంలోని ఎల్ ఐ సి ఆఫీసును సంప్రదించండి — మీ పాలిసీ సక్రమంగా నడుస్తోందన్న విషయాన్ని ధృవపరచుకొనుటకోసం.



లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

RADEUS/LIC/AS-2

"ఎలిమెంటరీ స్కూలు హెడ్మాస్టారు పంతులుగారు తెలుసా ?"

"ఆ... తెలుసనండీ"

"వాళ్ళింటి ప్రక్కనే..." అన్నాడు.

"అలాగేనండీ"

మూర్తి బయలుదేరాడు. అతని కెందుకో తృప్తిగా వుంది. ఈ పిల్లలతోనైనా కాల క్షేపం అవుతుంది.

*　*　*

"కాలువ పక్క పొలం కొంత బాగుచేయాలంట...వెంకన్న చెప్పాడు. వెంకన్నని తీసికొని వెళ్ళి కాస్త చూసిరా" జయమ్మంది.

"అలాగే..."

జయమ్మ లోపలికి వెళ్ళిపోయింది.

మూర్తి బయటకు వచ్చాడు.

"మాస్టారూ..." అంటూ పరిగెత్తుకొని వచ్చాడు ఒక పిల్లవాడు.

"ఏమిటీ ?..."

"ఈ లెక్క చేసి పెట్టాలండీ ..." పుస్తకం తీస్తూ అన్నాడు.

"ఈరోజే చూపాలా ?..."

"అవునండీ."

పుస్తకంతీసుకొని లెక్కచేసి చూపించాడు.

"థాంక్సండీ" అన్నాడు.

"నీపేరు" మూర్తి అడిగాడు.

"గోపి."

"లెక్కలు రాకపోతే...సాయంత్రం రండి"

"అలాగేనండీ" గోపి వెళ్లిపోయాడు.

మూర్తి పొలంవైపు నడక సాగించాడు.

అతని ఆలోచనలు స్నేహితుల మీదకు మళ్ళాయి.

దాదాపు అందరూ ఉద్యోగ ప్రయత్నంలో వుంటారు ప్ప్. తనే ఇలా పల్లెటూరికి

# గంగిరెద్దులు

వచ్చాడు. అత్తయ్యమాటను తను కాదనలేక పోయాడు. చాలా బోర్‌గా వుంది. వీళ్లంతా ఎలా బ్రతుకుతున్నారో !

"ఏమయ్యోయ్ మూర్తీ !"

రాయుడిగారి కంఠస్వరం గుర్తుపట్టి ఆగాడు.

"నమస్కారమండీ" అన్నాడు.

ఆయన ఇంటి వసారాలో పడక కుర్చీలో కూర్చున్నారు, చుట్టతాగుతూ.

"రావయ్యా. కొంచెం సేపు కూర్చునిపో" ఆహ్వానించారు.

మూర్తిని చూసిన దగ్గర్నుంచీ ఆయనకు మూర్తంటే మంచి అభిప్రాయం ఏర్పడింది.

మూర్తి వచ్చి కూర్చున్నాడు.

"ఒరేయ్ గోపన్నా...కాఫీ పట్రా"

"అబ్బే. వద్దండీ.ఇప్పుడే తీసికొనివచ్చాను" మొహమాటపడుతూ అన్నాడు.

"ఫర్వాలేదులే. మరొకసారి త్రాగు" నవ్వుతూ అన్నారు గోపన్న కాఫీ తీసికొని వచ్చాడు. గ్లాసు అందుకున్నాడు మూర్తి. రాయుడు గారేదో చెపుతున్నారు మూర్తి బుర్రూపుతున్నాడు కానీ ఆయన చెప్పేది వినటం లేదు

"వస్తానండీ...పొలానికి వెళ్లాలి..." అన్నాడు కొంచెం సేపాగి.

"అప్పుడప్పుడు...వస్తుండవోయ్..." అన్నారు

"అలాగే నండీ"

మూర్తిగబగబ ఆవీధి దాటాడు మూర్తిని చాలమంది వింతగా చూస్తున్నారు. మూర్తికి భలే సిగ్గేసింది. నేరో ఫాంట్లూ, బుషర్ట్స్ మానేసి పైజమాలాల్చీలు వేసికోవాలను కున్నాడు.

పది నిమిషాల్లో వెంకన్న ఇంటి దగ్గరకు వచ్చాడు. వెంకన్న మొక్కలకు పాదులు త్రవ్వుతున్నాడు.

"రండి బాబూ...ఏటిలా వచ్చారు." అన్నాడు మూర్తిని చూడగానే. "ఒరే సూరిగా బల్లట్రా."

"ఫర్వాలేదులే వెంకన్నా..."

చిన్న కుర్రవాడు స్టూలు తీసికొని వచ్చి వేసాడు.

"కూకోండి బాబూ..." వెంకన్నన్నాడు.

మూర్తి కూర్చున్నాడు.

"పొలం బాగుచేయలన్నావటగదా. నిన్ను వెంటబెట్టుకొని చూసిరమ్మందత్తయ్య." అన్నాడు.

"అయితే ... చేతులు కడుక్కొత్తానుండండి ..." అంటూ లోపలికి వెళ్లిపోయాడు.

మూర్తి దిక్కులుచూస్తూ కూర్చున్నాడు.

అతని చూపు ఎదురింటి పెరటివైపు పడింది. అక్కడొక అమ్మాయి. వోణీ వేసుకొని వుంది. సన్నగా...నాజూగ్గా...అందంగా వుంది. నల్లటి బారుజడ - తలలో పూలు.

ఆ అమ్మాయి పూలు కోస్తున్నది. ఆమె మూర్తిని గమనించలేదు.

"రండి బాబూ!" వెంకన్న మాటతో ఉలిక్కిపడ్డాడు లేచి, "వెంకన్నా! ... ఆ అమ్మాయెవరూ ?" అడిగాడు.

వెంకన్న అటు చూసి, "కిట్టాపుగారి రెండో అమ్మాయండీ. మొదటి బిడ్డకు పెళ్లయిపోనాదండీ. ఈ యమ్మింది, పదో క్లాసు చదివిందండీ, మనోళ్లే ..." గడగడ చెప్పాడు వెంకన్న.

దార్లో వెంకన్న దగ్గర్నుంచి గ్రహించిం దేమిటంటే కృష్ణారావుగారు మధ్యతరగతి కుటుంబీకులు. పెద్దమ్మాయి పెళ్లి కొంత పొలం అమ్మిచేసారు సీత రెండో అమ్మాయి. సీతకొక తమ్ముడున్నాడు. పరువు మర్యాదలు గల కుటుంబం.

ఇద్దరూ పొలం దగ్గరకు వచ్చారు.

*　*　*

పొలం పనికని ఉదయం వెళ్లి మధ్యాహ్నం వచ్చాడు మూర్తి.

"నీ కేవో ఉత్తరాలు, శుభలేఖలు వచ్చాయి" జయమ్మ చెప్పింది.



# సామాన్యుని సణుగుడు

రేడియోలో పాటకీ పాటకీ మధ్య విజయవాడ వాణిజ్య ప్రసార విభాగంలో ఆకాశవాణి వారు, హిమాలయా పర్వతశ్రేణి మధ్య యుద్ధరంగంలో వున్న వీరజవాన్‌ల పేర్లన్నీ ఎందుకు వినిపిస్తారో?... పాట పెట్టడానికి ముందే నాలుగు ప్రకటనలొస్తాయా? మీ కడుపు నొప్పిగా వుందా? మీకు తల నొప్పిగా వుందా? అంటూ కుశల ప్రశ్నలూ గట్రా వినిపిస్తాయి. ఆ తర్వాతనేమో "మన్‌చాహే గీత్" అంటూ లాన్స్‌లాట్ వీరేందర్‌సింగ్, జవాన్ ప్రతాప్‌సేన గుప్తా లాంటి పేర్ల జాబితా ఓ నాలుగు నిమిషాలదాకా వినిపిస్తుంది. ఆ దండకం యీ తోరణం రెండూ వినేసరికే అలసిపోయిన శ్రోతకి అసలు పాట సగమో, ముప్పాతిక సగమో వినపడుతుంది...

ఈ వినోద ప్రచార విభాగాలు యింటింటా బాగా పాపులర్ అయ్యాయికదా! ఏ యింట్లో చూసినా, పిల్లలు, ఆడాళ్లూ అంటే సామాన్య కుటుంబాలవాళ్లు — సినిమా పాటలకి బదులు యీ అడ్వర్టైజుమెంట్ బాణీలు, కూని రాగాలుగా తీస్తున్నారు — అకస్మాత్తుగా ఆరేళ్ల పెద్దాడు "యీవా "యీవా" అని అప్పుం చెవికోసిన మేకలాగ అరిచేస్తూంటాడు. ఏమిట్రా అనేలోగానే నాలుగేళ్ల రెండో పాపాయి "హెచ్ చ్‌మగ తెలుపు హెచ్చుగ ఉతుకు" లంటుంది!! పాట అడిగిన వాళ్ల పేర్లు, ఆ పాట అడిగిన వాళ్లు, ఆ పాటని అందరూ వినగోరటం సహజమే కాని విజయవాడ రేడియోస్టేషన్‌లోని యీ మనోరంజన్ టేపుల మధుర సంగీతం ముప్ఫయి మైళ్ల దూరంకూడా దాటిపోదే... అలాంటప్పుడు మూడువేల మైళ్ల పరిధిలోవున్న బొంబాయి కలకత్తా పేర్ల జాబితా అంతా చదవటం ఎవరికోసం?

ఆ పాటలు అడిగినవాళ్లు "దావా" తెస్తారా? లేకపోతే వింటున్న సామాన్యజనం అయ్యో యీ పాటలన్నీ శ్రోతలు కోరినవి కావేమో? నని బెంబేలు పడతారా? ఏవో "టేపు"లు పదే పదే వినిపిస్తూండటం, పాట మధ్యలో దాని గొంతు నొక్కి "ట్రింగ్" మంటూ ప్రకటనం "బాజా" వాయించేయడం — వాయించండి సార్! ఎవరొద్దన్నారు? అదేగా అసలు లక్ష్యం! సామాన్య జనాన్ని యిళ్లల్లోకి వచ్చి మీకు కడుపునొప్పా? కాలు బెణికిందా? యింట్లో దోమలున్నాయా? పిల్లలు గగ్గోలు పెడుతున్నారా? ఫలానీ సినిమా చూశారా? అంటూ కుశల ప్రశ్నలు వేసేందుకు యింకెవరున్నారుకానీ కాస్త సినిమా పాటలు పూర్తిగా చెవిని పడనియ్యండన్నదే సామాన్యుని గోల... హిందీభాయి అడిగిన పాటలు వాళ్ల పేర్లతోసహా వాళ్లకి వినిపించండి. పోనీ అవే పాటలు ఆ పేర్లు తీసేసి, ఆ దండకాల భాగాలో అడ్వర్టైజ్‌మెంట్‌లు పెట్టి మాకు వినిపించండి — అంటూ తెనుగోడు అరుస్తున్నాడే... ఆ గోల కూడా కాస్త రేడియోవారు వినొచ్చునే! అన్నీ ప్రకటనలే అయితే రేడియో కట్టేస్తారు అన్నీ పాటలే అయితే, ప్రభుత్వంవారికి కిట్టదు కనుక — జనరంజనిలోలాగా సుమ, ఉమ, ఉష, రుష, సష, హష అంటూ రైమింగ్ పేర్లు క్లుప్తంగా వినిపించి హిందీపాటలు వినిపిస్తే ఏలూరు నుంచి గుంటూరుదాకా రేడియోలున్నవాళ్లు హైదరాబాద్ పరిసరాల్లోవున్న శ్రోతలు కాస్త వాళ్ల 'కరెంట్' కర్టైనా కలిసొచ్చిందని సంతోషిస్తారుకదా? చివరికి యీ వివిధభారతి రేడియోలో వార్తలుకూడా.

ఆ టైముకాస్తా డబ్బు చేసుకుందామని — ఎగ్గొట్టేసారుకదా! పోనీ పాటలైనా విన్నివ్వండి—అంటే యీ సామాన్యుని సణుగుడు వింటారా? వాళ్లు! ప్చ్! ఉత్తది.

—'ఒక సామాన్య శ్రోత'

# గంగిరెద్దులు

టేబుల్‌మీద ఉత్తరాలు, శుభలేఖలు ఆత్రంగా అందుకుని చదవసాగాడు.

"నా స్నేహితులిద్దరి పెండ్లిత్తయ్యా." సంతోషంగా చెప్పాడు.

"ఎప్పుడు?"

"ఈ నెలలోనే, యిద్దరిదీ. విజయవాడలో ఇరవైన ఒకరిది, హైదరాబాదులో ఇరవై ఆరున మరొకరిది. తప్పక రమ్మని మరీ మరీ వ్రాసారు..."

జయమ్మ మాట్లాడలేదు, పళ్ళెంలో అన్నం వడ్డిస్తున్నది. స్నేహితులను తలుచుకుంటూ మౌనంగా భోజనం చేసాడు మూర్తి.

గిన్నెలన్నీ సర్దివచ్చి అంది జయమ్మ.

"అయితే ... ఎప్పుడు వెళ్ళాలనుకుంటున్నావ్?"

"రేపు వెళ్దామనుకుంటున్నా..." కొన్ని క్షణాలాగి అన్నాడు.

"నా స్నేహితులు కొంతమంది అప్పుడే వచ్చేసారంట. ఉత్తరంలో వ్రాసాడు. నన్ను వీలయినంత త్వరగా రమ్మన్నాడు. మేమంతా పి. యు. సి. నుంచి కలిసి చదివాము."

జయమ్మ జాకెట్టు కుట్టుకుంటు కూర్చున్నది.

మూర్తి బట్టలన్నీ బయటకు తీసి, మూటకట్టాడు.

"చాకలిని పిలుచుకొస్తాను..." అన్నాడు చెప్పులు వేసుకొంటూ.

"మునసబుగారు పూర్నించి వచ్చారంట ఒకసారి కనబడిరా" అంది. 'మునసబుగారికి కనబడటం ఎందుకు' అనుకున్నాడు. మరల వెంటనే గుర్తుకు వచ్చింది.

పల్లెటూర్లలో పిల్లలు ... వూరు వెళ్ళే ముందు చెప్పి వెళ్ళటం, రాగానే కనబడటం, కుశల ప్రశ్నలు... నవ్వుకున్నాడు మూర్తి.

"మూర్తి!"

—పిలుపు విని జయమ్మ బయటకు వచ్చింది.

"నువ్వా రమణా. లోపలికిరా..."

"మూర్తిలేడా పిన్నీ?" లోపలికి వస్తూ అడిగాడు.

"స్నేహితుల పెండ్లికని వెళ్ళాడు. వెళ్ళి, నాలుగు రోజులయింది. నెలాఖరుకు వస్తాడు."

"నెలాఖరుకా?"

"రెండు పెళ్ళిళ్ళు అందుకని. కూర్చో."

"ఫర్వాలేదు పిన్నీ..."

"ఏమిటి సంగతులు? అమ్మా అంతా బావున్నారా?" అడిగింది.

"ఆ. అంతా బావున్నారు. అక్క హౌస్ సర్జనయిపోయింది కదా ... ప్రాక్టీసు ఈ వూర్లోనే పెడుతుందంట."

# తరచుగా ఇంట్లో 'డాక్టరు'గా పని చెయ్యాల్సి వస్తుందా?

## బలీయమైన మరియు విశ్వసనీయమైన అనాసిన్ మీ మందుల పెట్టెలో ఉంచుకోవటం చాలా మంచిది.

ఆ రోజు ప్రతిదీ సక్రమంగా జరుగని రోజులలో ఒకటి. మీరు ఆలస్యంగా లేచారు, ఇంట్లో వంట సామాన్లు అయిపోయాయి. మీ అబ్బాయికి జలుబు చేసింది. ఫ్లూ వస్తున్నట్లు అనిపిస్తుంది.

అతన్ని వేడి పానీయంతో అనాసిన్ ఇచ్చి పడుకో పెట్టండి. సత్వరంగా పని చేసే అనాసిన్ జలుబులు మరియు ఫ్లూల వలన కలుగు నొప్పులను, బాధలను నివారిస్తుంది. డాక్టరు ఇచ్చే విశ్వసనీయమైన మందు లాగా అది ఒక మందుల సమ్మేళనం.



మీ అమ్మాయి ఒంట్లో బాగుండక, బాగా నొప్పి మరియు నడుం నొప్పితో స్కూలు నుంచి త్వరగా తిరిగి వచ్చింది.

ఆమెకు వేడి నీళ్ల కాపు పెట్టి అనాసిన్ ఇచ్చి హాయి కల్పించండి ఆమె త్వరలోనే సంతోషంగా, కులాసాగా ఉండగలదు. అనాసిన్ కొన్ని రోజులలో కలుగు వ్యథను తగ్గిస్తుంది. ఎందువలనంటే అది బాధను తగ్గించుటయే గాక బాధ వలన కలుగు మానసిక చికాకును సత్వరంగా తొలగిస్తుంది.



మీ భర్త తనపై అధికారితో పేచీ పడి, వ్యాకులత వలన విపరీతమైన తలనొప్పితో బాధ పడుతున్నారు.

ఆయనకు చల్లగా సేద తీర్చే పానీయం, అనాసిన్ ఇచ్చి కులాసా చేకూర్చండి ఎందువల్లనంటే అనాసిన్‌లో ప్రపంచమంతటా డాక్టర్లు సిఫారసు చేసే బాధా నివారక పదార్థాలు బాగా ఉన్నాయి



మీరు పార్టీకి ఎన్నో ఏర్పాట్లు చేయవలసి యున్నాయి కాని వ్యవధి చాలా తక్కువ ఉంది. మీరు అలసిపోయారు. తలనొప్పితో బాధ పడుతున్నారు. ఏక్షణంలోనైనా అతిథులు రాగలరు.

మీ సాయంత్రపు కార్యక్రమం తలనొప్పి వలన పాడు కావచ్చును. సత్వర నివారణ పొందండి. అనాసిన్ తీసుకోండి. మీరు మళ్లీ సంతోషంతో ఉండగలరు. గుర్తుంచుకోండి, మీ కుటుంబపు డాకరును పిలువనవసరం లేని స్వల్ప సందర్భాలలో, బలీయమైన మరియు సత్వరమైన అనాసిన్ వాడండి. అదే మీ ఉత్తమ మిత్రము.



బలీయమైన మరియు విశ్వసనీయమైన

# అనాసిన్

భారతదేశపు
ఎక్కువ జనప్రియమైన నొప్పినివారిణి




Regd User of TM Geoffrey Manners & Co Ltd

A 58

"చాలా సంతోషం..." జయమ్మ కళ్ళలో నీళ్ళు తిరగాయి.

"మూర్తి వుంటే బావుండేది పిన్నీ..."

గంగిరెద్దులు

మూర్తి లేనందుకు నొచ్చుకున్నాడు.



"వస్తాను పిన్నీ... కొంచెం పనుంది... ఆస్పత్రి పనులు చూడాలి" రమణ వెళ్ళిపోయాడు. జయమ్మకళ్ళల్లోంచి రెండు కన్నీటి బొట్లు రాలాయి. పెళ్ళయిన పదేళ్ళకే తను నుదుట కుంకుమ కోల్పోయింది. ఒక్కగా నొక్క కూతురు. రాధ...తనకు తోడుగా మిగిలింది. ఎంత అందంగా వుండేది...కానీ... ఆవెధవరోగం వచ్చి తన రాధని పొట్టన పెట్టుకుంది. అప్పుడే ఇక్కడ ఆస్పత్రి వుంటే తన పాప తనకు దక్కేది!

కానీ... తనకా అదృష్టం లేదు.

"ఏమిటయ్యోయ్ ..మీ అక్కయ్య ఆస్పత్రి పెడుతుందట ?!" రమణని చూడగానే అడిగారు రాయుడుగారు.

"నిజమేనండీ..."

"ఏం? మీనాన్న పెళ్ళిచేయడా ఏమిటే ?"

చిర్రెత్తుకొచ్చింది రమణకు.

"మా అక్క కిష్టం వచ్చినప్పుడు చేసుకుంటుందండీ" అన్నాడు కావాలని.

"ఏమిటీ ?" ఆశ్చర్యంగా, అన్నారు.

రమణ మాట్లాడలేదు.

"అయినా...ఎందుకొచ్చిన యింగ్లీషు మందులయ్యా? లేనిరోగం తెచ్చుకోవటానికి కాకపోతే. నా మాటవిని..."

"మా అక్కయ్యకు చెప్పండి" అన్నాడు రమణ ఆ ప్రసక్తి యిష్టంలేక.

"ప్చ్. మీరు మా మాట వింటారటయ్యా ?... కుర్రకారు..." గొణిగారు రాయుడుగారు.

రమణ వస్తానంటూ బయలుదేరాడు. రమణ ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

ఈయన పాతకాలం మనిషి. క్లినిక్ ఓపినింగ్‌కి పిలుస్తే వస్తాడా ? వాలకం చూస్తుంటే ఇంగ్లీషు మందులంటే పడవు లాగుంది. పిలుస్తే సరి, వస్తే వస్తారు. లేకపోతే లేదు.

* * *

మూర్తి బస్సు దిగాడు. బల్లకట్టు ఎక్కాడు.

కాలువమీద వంతెన లేదు. బస్సు కాలువ అవతలే ఆగిపోతుంది. కాలువ బల్లకట్టు మీద దాటి వూరు రావాలి.

బల్లకట్టు దిగుతున్న మూర్తిని చూసి పరిగెత్తుకొని వచ్చాడు వెంకన్న.

బెడ్డింగు తలమీద పెట్టుకొని, సూట్‌కేస్ చేతితో పట్టుకున్నాడు.

'అత్తయ్య బావుందా?' అడిగాడుమూర్తి.

“బాగానే వున్నారండి. అన్నట్టు బాబూ ...ఆరు ఆస్పత్రి పెట్టేరండి.” అన్నాడు వెంకన్న.

మూర్తి కర్థం కాలేదు. “ఆస్పత్రేమిటి ?”

“ఆరేనండీ ..., రమణయ్య అక్కగారు. మనూర్లో ఆస్పత్రి పెట్టేసారు కదండీ.”

ఆనందాశ్చర్యాలు కలిగాయి మూర్తికి. రమణ ఎప్పుడో ఈ విషయం చెప్పాడు తనకు, వాళ్లక్క ఈ వూర్లోనే ప్రాక్టీసు పెట్ట వచ్చని. అయితే ఇంత తొందరగా అని అనుకోలేదు.

“...ఎవరో ఇంగ్లీసాయన కూడా వొచ్చారండీ ...” వెంకన్న చెప్పుకు పోతున్నాడు. మూర్తి అదేమీ వినటంలేదు.

రమణ అక్క ఎలా వుంటుంది ? ఆవిడ స్వభావం ఎటువంటిది ? ఆలోచిస్తున్నాడు.

( స శే షం )

### ఉప్పులో తప్పు

హైదరాబాద్‌లో 19 ఏళ్ల బాలయ్య అనే అతను కడుపునొప్పిగా ఉండి ఇంట్లో ఉప్పు లేక ఎక్కింటి రామిరెడ్డిగారింట్లోంచి ఉప్పు తెచ్చుకుని కాసిన్ని నీళ్లల్లో కలుపుకుని త్రాగి పనిలోకి వెళ్లాడట. ఆ ఉప్పుతో వండిన వంటకాలను తిని రామిరెడ్డి, అతని భార్య తమ తమ పనుల్లోకి వెళ్లిపోయారట. ఇంట్లోవారి నలుగురూ పిల్లలూ అన్నం తిని ఆడుకుంటున్నారట ఉప్పు నీళ్లు త్రాగిన బాలయ్య పనిలోకి వెళ్లబోతూ కళ్లు తిరిగి పడితే అతన్ని ఆసుపత్రికి తీసుకు బయల్దేరారట బాలయ్య ఆసుపత్రికి చేరేలోగానే చనిపోయాడట పనికివెళ్లిన రామిరెడ్డి దారి మధ్యలో పడి చనిపోయాడట ఆతని భార్య దారిలో వాంతి చేసుకుని, స్పృహ తప్పిపడిపోతే ఆమెను కొందరు ఆసుపత్రిలో చేర్చారట. ఇంట్లో ఆడుకుంటున్న పిల్లలు వాంతులు చేసుకుని పడిపోతే చుట్టుపక్కలవారా నలుగుర్ని ఆసుపత్రికి తీసుకువెళ్తుండగా దారిలో 14 ఏళ్ల గంగారెడ్డి చనిపోయాడట దీనిని బట్టి ఆ ఉప్పులో ఏ విష పదార్థమో కలిసి ఉండుండి తీరాలని పోలీసు నిర్ణయించి, ఆ ఉప్పును స్వాధీనపరచుకుని, అది అమ్మినవాడిని, అక్కడి ఉప్పును కూడా పట్టేశారట.

### అలజడికి దారితీసిన అసభ్యత

అహమ్మదాబాదులో దావూద్ అనే వో పోలీసు ఇన్‌స్పెక్టరు, అతని భార్య, కూతురు రోడ్డు మీదో చోట నిలబడి ఉండగా వో బట్టల షాపు నుంచి ఆ షాపు సొంతదారు దావూదు కూతురిని చూసి అసభ్యమయిన సౌంజ్ఞలు చేసి, అసభ్యంగా మాట్లాడాడట దాంతో అతనిని పోలీసు అరెస్ట్ చేసిందట తత్ఫలితంగా అతన్ని విడిచివేయాలని నినాదాలు చేస్తూ వూరు వూరంతా తిరగబడిందట బస్సులకు నిప్పెట్టారట కొట్లు తలుపులు పగలేసి సరుకులు దోచుకున్నారట రాళ్లు రువ్వారట అద్దాలు వగైరా పప్పు పప్పు చేశారట ఈ చర్యలు భాష్పవాయువు వరకూ వెళ్లాయట. ప్రజా ప్రభుత్వ మననేమి?

### అంతులేని ఆకలి చావులు

ఈ సంవత్సరాంతంలోగా భూమండలం మీద ...లేదన్నా పది మిలియనుల ఆకలి చావులైనా ...టాయని, వీటికి వాతావరణ దుస్థితి, తదితర



స్థితులే కారణాలని నోబెల్ ప్రయిజు గ్రహీత డాక్టర్ నార్మన్ బోర్లాగ్ అన్నారట.

### సిమెంటుతో కుటుంబ నియంత్రణ

కుటుంబనియంత్రణ పథకంలో స్టెరిలైజేషను (ఇహ పిల్లలు పుట్టకుండా చేయించుకొనే ఆపరేషను) చేయించుకున్నవారికి మామూలుగా ఇచ్చే పారితోషికమేగాక, వో అయిదు బస్తాల సిమ్మెంటు అసలు ఖరీదుకు యిస్తామని వారియానా ప్రభుత్వం ఆశపెడుతోందట. ఆడవారు చేయించుకుంటే అరవై రూపాయలు, మగవారికయితే యాభయి అయిదు రూపాయలు మామూలుగా యిస్తోందంటే రాష్ట్రం. ఈ లెక్కనపోతే సిమ్మెంటు బస్తాలేగాక — ఆపరేషను చేయించుకొంటే యమ్మెల్యే పోస్టిస్తామని కూడా అనే కాలం వస్తుందేమో! యమ్మెల్యే పోస్టు సిమ్మెంటు బస్తాకన్నా కాస్ట్లీయా ఏం!

అలా గెరిపేరు చేయిస్తాను
దేవయ్యా ఇల్లు మొదట
అలాంటి దాలు మనకోరాని!



### ప్రభుత్వోద్యోగి కాపోతే పరవాలేదా ?

జూలై ఇరవై అయిదవ తేదీన లోక్‌సభ (ఢిల్లీ) ప్రేక్షకుల గ్యాలరీలోకి మొలలో కత్తి దోపుకుని వెళ్లి చూసిన 24 ఏళ్ల విప్లవ బాసు అనే యువకుణ్ణి పట్టుకునేసరికి అతను ఎదురు తిరిగి వో ప్రభుత్వ ఉద్యోగిని కొట్టాడట. ఆ నేరానికా సభాపతిగారతనికో నెల కఠిన శిక్ష విధించారట. ఆ శిక్ష అతను అనుభవించి బయటకు రాగానే పోలీసులు అతన్ని అరెస్ట్ చేసి ఆయుధాన్ని పట్టుకుని పబ్లికున తిరిగినందుకు, ప్రభుత్వోద్యోగిని తన్నినందుకు కేసు వేశారట— ప్రభుత్వోద్యోగి కాపోతే తంతే ఫర్లేదనా ?

### జైల్లో దొంగనోట్ల బ్లాకులు

దొంగ నోట్లు ముద్ర చేసిన నేరానికి భాస్కరన్ అనే వో ఉత్సాహవంతుణ్ణి కోయంబత్తూరు జెయిల్లో శిక్షించి పడేస్తే, ఆ ఉత్సాహవంతుడు అక్కడి వో ముగ్గురు వార్డెనుల సహాయం తీసుకొని ఇరవయి రూపాయల నోటు దొంగతనంగా ముద్రించడానికి అనువైన నాలుగు అల్యూమినియం బ్లాకులను తయారు చేశాడట ఆ బ్లాకులను బయటో పార్టీకి అందజేయటానికి వారు తీసుకవెళ్తూ పట్టుబడిపోయారట. అప్పలంత తెలివైన వారిని శిక్షించకుండా ప్రభుత్వంలో పెద్ద పెద్ద ఉద్యోగాలిస్తే గాని దేశం బాగుపడదు— ఇంటలిజెన్స్ పుడ్డి రస్పెక్టెడ్! య్యా!

### సరస్వతీ గిరిగారి సత్యాగ్రహం

శ్రీమతి సరస్వతీగిరిగారు క్రొత్త ప్రెసిడెంటు ప్రమాణస్వీకారం జరిగినప్పుడు గిరిగారితో ఆ మహోత్సవానికి హాజరు కాలేదట. అంతకు ముందే ఆవిడ ఢిల్లీ విడిచివెళ్లిపోయారట. గిరిగారి సామానులు, పరివారం ఢిల్లీనుంచి బెంగుళూరు వెళ్తున్న ప్రత్యేక రైలులో ఆవిడ గిరిగారికన్నా చాలా ముందు ఏ ప్రకటనా లేకుండా వెళ్లిపోయారట. గిరిగారు మరో టరమ్ (అనగా ఐదేళ్లు!) ప్రెసిడెంటుగా ఉండుండాల్సిందని, ఎన్నికలలో పోటీ చేసి ఉండుండాలని ఆవిడ అభిప్రాయమట.

### లక్షలు ఖరీదుచేసే జపాను బట్టలు

బొంబాయిలో ఆగస్టు 25వ తేదీన కస్టమ్స్ తదితర శాఖలూ చేసిన దాడులలో రెండు చోట్ల కలిపి 26 లక్షల విలువ చేసే జపాను బట్టలూ వగైరాలు దొరికాయట.

## లాలస

(14వ పేజీ తరువాయి)

దురుగా స్టూలు జరుపుకుని దానిపై కాళ్లు పెట్టుకుని 'ప్రేమ మనసు' అన్న సాంఘిక నవల చదువుతోంది. తల్లిమాట ఎక్కడా చెవులకి సోకలేదు. సుందరి వాలకం చూసి సుభద్రమ్మకి ఒళ్లు మండుకొచ్చింది. ఇళ్లన్నీ ఎల్లా పడితే అల్లా వున్నాయి. ఇంకో గంటలో పేరంటాళ్లు వస్తారు, దీనికేమయినా బుద్ధి వుందా అసలు! అనుకుంది.

''ఒసేయ్! సుందీ! అస్తమానం ఆ వెధవ పోకిరీ పుస్తకాలు చదవకపోతే ఇంట్లో కాస్త పని చూడరాదూ అంది'' 'పోనీ ఆచదివేదేదో రామాయణమో భారతమో అయితే పుణ్యం పురుషార్థం' అన్నది.

''అవి తెలుసున్న కథలే కదే! ఇంకా చదివేదేమిటి? నేను పుట్టినప్పట్నుంచి వింటున్న భారతమే'' అంది ఈసడింపుగా సుందరి.

''ఏమిటీ? అయితే నీకు భారతం అంతా తెలుసన్నమాట! ఏదీ... అంబికా, అంబాలిక ఎవరో చెప్పు చూస్తాను'' అన్నాడు అప్పుడే లోపలికి వస్తున్న తండ్రి నవ్వుతూ. హఠాత్తుగా తండ్రి అలా వచ్చి అడిగేసరికి బిత్తర పోయింది. అసలు భారతంలో అంబిక, అంబాలిక ఉన్నారన్న సంగతే తెలియదు. ఇంక వాళ్ల గురించేం చెబుతుంది? తెల్లమొఖం వేసుకుని చూసింది సుందరి.

(ఇంకావుంది)

## కోటివిద్యల్లోలేనికొత్తకూటివిద్య

(18 వ పేజీ తరువాయి)

"వున్నాయి కాని నేను పా ..." అనబోతున్నాను. నామాట పూర్తిగా వినిపించుకో లేదు

"చూపించండి సార్" అన్నాడు వేలాం వ్యక్తి. నన్ను పైసలు వెలికి తియ్యమన్నట్లు సైగచేస్తూ జేబులోనుంచి ఇరవై రూపాయిలు తీసేను. నాచేతిలోని పైసలు తీసుకొని

"పైసాలున్నాయి వీరిదగ్గర ... వీరు ఆసామాన్లు కావాలనే పాడేరు" అంటూ అందరికీ డబ్బు చూపించేడు వేలాం వ్యక్తి.

నాకిదొక యింద్రజాలంలా వుంది "నేను పాడలేదురో నీ పర్సు ఔసరంలేదు." అన్నా ఎవరూ వినిపించుకోరు.

వెంటనే వేలాంవ్యక్తి నాచేతిలోని పర్సు తీసుకొని, ఆ స్టీలు సామాన్లు, ఒక్క రూపాయి నాచేతిలో పెట్టేడు ట్రైను సికింద్రాబాద్ చేరుకుంది. ప్రయాణీకులలో కల్లోలం ఎక్కువయింది. నేను ఆశ్చర్యం నుండి తేరుకొనక ముందే ఆ వేలాంవ్యక్తి, సూట్‌కేస్‌వ్యక్తి, హిప్పీ జుత్తుల వ్యక్తి, ఆ సామానులకు పాట పెట్టిన చాలామంది వ్యక్తులు దిగిపోయి క్రిందనున్న జనంలో కలిసిపోయారు.

అవి నిజమైన స్టీలు సామాన్లు కావు. వాటి లోపలిభాగంలో పింపురువుంది. పైని తెల్లని పూతవుంది. జరిగిన మోసానికి తల దించుకున్నాను. బస్సు ఎక్కించకముందు నా మిత్రుడన్న మాట జ్ఞప్తికి వచ్చింది. "జౌను మనుషులున్నారు జాగ్రత్త"ని నాకు నేను హెచ్చరించుకుంటూ బట్టల సంచిని సర్దుకున్నాను.

## అ పీ—ఇ పీ—అ స్పీ

### అపూర్వాశీయ గీతావళి

పూజ్యశ్రీ బాబా అంబేద్కర్ అపూర్వాశీయ గీతావళి. రచన: శ్రీ పదమళ్ళ, 16 పేజీలు. వెల 40 పైసలు. ప్రతులకు: శ్రీ పదమళ్ళ, పండిత విల్లూరు, నర్సాపురం తాలూకా, ప.గో. జిల్లా.

### గుమ్మటాలు

బాలల గీతాలు, రచన శ్రీ వడ్డి విజయసారధి, 38 పేజీలు వెల 2 రూపాయలు ప్రతులకు, ఓం ప్రకాశ్ ముద్రణాలయం, 28—553, జలాలుపేట, మచిలీపట్నం—1


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**

